# ఆంధ్రపత్రిక



31(911

The Andhra Patrika, Madras, } Regd No 1118, Vol, 34 No 140 SATURDAY 13th SEPTEMBER 1947 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

# ఇండోచైనాలో కీలుబొమ్మప్రభుత్వస్థాపనకు ఫ్రెంచి కుతంత్రం

## మాజీ చక్రవర్తికి అధికారం కట్టబెట్టే సూచన

### వీట్‌నాంను అణచివేసే ఎత్తుమాసం

హానోయ్, సెప్టెంబరు 11: ప్రవాసంలో ఉన్న ఇండోచైనా మాజీచక్రవర్తి బావోదాయ్ ఆధ్వర్యాన ఇండోచైనాకు తాత్కాలిక జాతీయప్రభుత్వం హాంకాంగులో ఏర్పడుతుందనీ, దీనిని ఫ్రెంచివారు గుర్తిస్తారనీ తెలుస్తున్నది. బావోదాయ్ ఇప్పుడు హాంకాంగులో ఉన్నాడు.

రెండేళ్ళపైగా డా॥ హోచిమిన్ నాయకత్వాన ఫ్రెంచివారితో పోరాడుతున్న వీత్‌నామీస్‌ను తోసి రాజని, ఫ్రెంచి హైకమిషనర్ విన్నచేసిన ప్రతిపాదనకు ఇది ఫలితం కావచ్చును. ఈ వీత్‌నామీస్ ప్రతిఘటనను పూర్తిగా అణచివేసేందుకు అక్టోబరు మొదట్లో పెద్ద ఎత్తున సైనికదాడులను ఫ్రెంచివారు ప్రారంభించవచ్చునని ఫ్రెంచివర్గాలలో అనుకుంటున్నారు.

బావోదాయ్ పొందదలైన వారు దేశద్రోహులనీ, క్విస్లింగులనీ, వారికి మరణదండనే తగినశిక్ష అనీ, వీట్‌నామ్ ప్రభుత్వ రేడియో ఈవేళ తీవ్రంగా నిందించింది.

### ఫ్రెంచివర్గాల వైఖరి

పారిస్, సెప్టెంబరు 11: బావోదాయ్ ఆధ్వర్యాన ప్రభుత్వం నిర్మించే సూచనను ఫ్రాన్సులోని మితవర్గాలన్నీ సమర్థించినవి. సోషలిష్టుపార్టీ పత్రిక 'లెపాప్యులేర్' కూడా పూర్తిగా సమర్థించింది. కాగా వరకు వామపక్ష పత్రికలన్నీ ఈ ప్రతిపాదనను తీవ్రంగా ఖండించినవి.

అధికార దఖలుచేసే సందర్భంలో డా॥ హోచిమిన్‌కు [illegible] స్థాపించాలని ప్రయత్నిస్తున్నాము."

### బావోదాయ్ పక్షం

లీత్‌మిన్, (డా॥ హోచిమిన్ పక్షం) పక్షపు కమ్యూనిస్టు అభిమానానికి ఇష్టంలేని ఇండోచైనీయులంతా బావోదాయ్ పక్షంలోకి చేరుతున్నారు. దీనికి 'చక్రవర్తిపక్షం' అనిపేరు. బావోదాయ్ ప్రభుత్వంలో హోచిమిన్ వ్యతిరేకులైన కొమనలిస్టు నాయకులంతా వుంటారు. తన శాంతిప్రణాళిక పూర్తిగా అమలుజరిపేందుకై ఫ్రెంచి హైకమిషనర్ ఎమిల్ బొల్లార్ట్ ఇంకా ఒక నెలరోజుల వరకూ ఇక్కడే వుంటాడు.

ఇండోచైనాలోని మైనారిటీలవారిక్కలను రక్షిస్తూ కొన్ని శాసనాలు చేయబడేట్టుగా ఫ్రెంచిహైకమీషనర్ చూస్తాడట. ఇందులోని మూడురాష్ట్రాలకూ అభిప్రాయభేదాలున్నట్లే హైకమిషనర్ మధ్యవర్తిగా వ్యవహరిస్తాడు.

### ప్రతిపాదన అంతరార్థం

వాషింగ్టన్, సెప్టెంబరు 10: ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వంవున్న ఏ ఆసియా దేశమైన ఇండోచైనా వ్యవహారాన్ని సమితి దృక్కోణం కలిగించుకోవాలని ప్రతిపాదిస్తుందేమోనన్న భయం చేతనే, ఫ్రాన్సు ఈ నూతన ప్రతిపాదనలను చేసినదని ఇక్కడ రాజకీయవర్గాలవారు భావిస్తున్నారు. డా॥ హోచిమిన్ ప్రతినిధులు, ఇండియా ప్రభుత్వోద్యోగులతో సంప్రదించటమూ, ఇండియా ప్రధాని నెహ్రూతో వీట్‌నామ్‌తో అత్యంతసన్నిహిత సంబంధాలు వుంచటమూ, ఆసియా రాజ్యాలసభలో ఆయనవారి సమస్యలను వారితో చర్చించటమూ, అందరికీ తెలిసినదే, కాబట్టి శ్రీమతి విజయలక్ష్మీపండిట్ మాస్కోనుంచి ఇక్కడకురాగానే ఇండియా నెట్టి ప్రస్తావిస్తుందని ఇక్కడ అనుకుంటున్నారు.

## ఇండియాకు ఆహారధాన్యాల అరువు

### బ్రిటన్ ఈ నెలలో సరఫరా చేసే సూచన

లండన్, సెప్టెంబరు 11: ఆహారధాన్యములను అరువుగా యిచ్చి క్షామపరిస్థితులలో భారతదేశమునకు సహాయముచేయు విషయమును బ్రిటిష్ ప్రభుత్వమువారు జరూరుగా విచారించుచున్నారని ఇండియన్ యునైటెడ్ ప్రెస్‌వారికి వైట్‌హాల్ వర్గముల ద్వారా తెలియుచున్నది. ఈ మాసము అత్యవసరముగా కావలసియున్న ధాన్యమునకుగాను చాలా త్వరలో ఈ అరువుధాన్యము లభ్యము గావింపబడునని తెలియుచున్నది.

ద. అమెరికాలో భారతదేశముకొన్న ధాన్యమును గొంపోవు నావలను మరలించి అక్టోబరులోగాని, నవంబరులోగాని ఈ అరువు ధాన్యమును భారతదేశం వాపసు చేయవలసి యుండును. ఆహార ధాన్యముల అరువుకై 'భారతదేశ పక్షమున యెవరు రాయబారములు జరుపుచున్నారో వెల్లడి కాలేదు. కాని భారత హైకమీషనరు శ్రీ కృష్ణమీనన్‌గారు యిందు విషయమై ప్రస్తావించి యుండవచ్చునని ఊహించుచున్నారు. అట్లీగారు సెలవుపై వెళ్లినప్పుడు అక్టింగ్ ప్రధానిగానుండిన హెర్బర్టు మారిసన్‌గారిని గత సుమావానం కృష్ణమీనన్‌గారు సందర్శించి యుండిరి. అప్పుడు ఆయన ఈ విషయమును ప్రస్తావించియుండవచ్చును. నేటి ఉదయం శ్రీ మీనన్‌గారు కామన్‌వెల్తు సంబంధముల మంత్రియగు ఆర్థర్ హెండర్సన్‌గారినిదర్శించి యితర విషయములతో బాటు భారతదేశమునకు ఆహార పదార్థములను అరువుగా యిచ్చు విషయమై యింకను వివరములను చర్చించిరని, తెలియుచున్నది.

## గవర్నర్ జనరల్‌తో గాంధీజీ చర్చ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 11: ఈరోజు సాయంత్రము గాంధీమహాత్ముడుభారతదేశ ప్రభుత్వకార్యాలయములో గవర్నరు జనరలు లార్డు మౌంటుబాటన్‌ను చూచినాడు. ఆ సమయములోనే—నిన్నటిదినము రంగూనునుంచి ఇక్కడికి చేరిన లార్డు లిస్టోవెల్‌(బర్మామంత్రి)ను కలుసుకొన్నాడు. లార్డు లిస్టోవెల్ ప్రధానామాత్యుడు పండిత జవహరులాల్ నెహ్రూనుకూడా కలుసుకొన్నట్లు తెలుస్తూఉంది.

ఇండియా గవర్నరుజనరలుకు అడ్వయిజరు అయిన లార్డు ఇస్మేయున్నూ లార్డు లిస్టోవెల్‌న్నూ రేపటిదినము కరాచీపట్టణము వెళతారు. లార్డు ఇస్మే కరాచీపట్టణములో కొంతకాలము ఉంటాడు.

## 'పాకిస్థాన్' స్టాంపులు

కరాచీ, సెప్టెంబరు 11: 'పాకిస్థాన్' ముద్రవేసిన స్టాంపులూ తదితర తపాలా సామగ్రీ 1947 అక్టోబరు 1వ తేదీ నుంచి అమలులోకి వస్తాయనీ అనాటినుంచీ అటువంటి ముద్రలేనివాటిని డబ్బుచెల్లించని వాటితో సమానంగా చూస్తామనీ పాకిస్థాన్ తపాలాశాఖ ఇవ్వాళ ప్రకటించింది.

న్యూఢిల్లీ, సెప్టెంబరు 11: ఢిల్లీ రైల్వే స్టేషనులో పాకిస్థాన్ సుద్దుబండి గార్డు రైలుమీద దండెత్తడానికి వచ్చిన ప్రజలను తుపాకితో కాల్చి తరిమివేశాడు. ఇందువల్ల ముగ్గురు చనిపోయారు.

### ప్రభుత్వఆహారశాఖ

ఢిల్లీ, సెప్టెంబరు 11: ఇండియాప్రభుత్వానికి అమెరికాలో ఆహారవిషయంలో సలహా ఇచ్చేందుకు టి. రాజన్‌గారిని నియమించారు. ఈయన ఇదివరకుదక్షిణ్ సంస్థానాలకు ఆహార సప్లయిల డిప్యూటీ కమీషనర్‌గా ఉండేవాడు.

ఢిల్లీ రైలుస్టేషనులో చాలా సుద్దుబండ్లు నిలిచిపోయి ఉన్నవి. వాటిలో సరుకులు దిగుమతి చేయవలెను. ఇప్పుడు ఢిల్లీ నగరములో కావలసినన్ని తిండిగింజలు ఉన్నవి. అయితే వాటిని ఆయా ప్రదేశాలకు పంపిణీచెయ్యడము ఒక సమస్య అయిపోయింది. చిక్కును తొలగించడానికి ప్రభుత్వమువారు ఏర్పాట్లు చేస్తున్నారు.

## ఇటలీనుండి ఆక్రమిత సైన్యముల ఉపసంహరణ

రోమ్ సెప్టెంబరు 11: ఇటలీనుండి బ్రిటిష్, అమెరికన్ సైన్యముల ఉపసంహరణ రేపు ప్రారంభమగునని ఆక్రమణ సైన్యాధిపతి జనరల్ లీ ప్రకటించాడు.

## ఢిల్లీపరిస్థితి: గాంధీజీ ప్రకటన

### న్యాయబద్ధమైన పౌరులుగా వుండవలెనని సిక్కు మిత్రుల వాంఛ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 10: ఇవ్వాళ ఒక ప్రకటనలో ఢిల్లీ పరిస్థితిని గూర్చి మహాత్మాగాంధీ ఇట్లా వెల్లడించారు.

"ఇవాళ పగలు నన్ను డా॥ సుశీలా నాయరునూ రాజకుమారీ అమృతకౌర్ ఇర్విన్ ఆస్పత్రికి తీసుకవెళ్ళింది. అక్కడ జాతి మత విచక్షణలేకుండా గాయాలు తగిలిన వారికందరికీ చికిత్స చేస్తున్నారు. అక్కడఉన్న బాధితులలో తుపాకి గుండు దెబ్బతిన్న అయిందేండ్లయినా నిండని ఒక చిన్న పిల్లవున్నది. వైద్యులూ, నర్సులూ చాలా కష్టపడి పనిచేస్తున్నారు. బాధితులలో చాలామంది మహమ్మదీయులే?

రక్షణ శిబిరాలలో పరిశుభ్రత పాటించేందుకు పాకీవారిని సప్లయి చేసేందుకు సాధ్యంకావడంలేదనీ, అందుచేత అక్కడ కలరావంటి అంటువ్యాధులు వ్యాపిస్తాయేమోనన్న భయం కలుగుతోందని రాజకుమారీ అమృతకౌర్ నాతో చెప్పింది. మరుగు దొడ్లదగ్గరనుంచి రక్షణార్థులు తమ శిబిరాలను తామే పరిశుభ్రంగా ఉంచుకోవాలి. అంగవైకల్యం పొందినవారు తప్పితే తక్కిన వారందరూ ఈ విషయంలో శ్రద్ధ వహించితీరాలి.

పగలు నా దగ్గరకు పాకిస్థాన్, హైకమీషనర్ వచ్చారు. ఆయన అనోన్యమైత్రి సహకారాల్లో మిక్కిలి విశ్వాసం కలవారు.

రెండుసార్లు కొందరు సిక్కు స్నేహితులు గూడా ఇవ్వాళ నా దగ్గరకు వచ్చారు. ఇండియా ప్రభుత్వం కృపాణధారణ విషయమై జారీచేసిన నిషేధాజ్ఞల విషయంలో వారు చాలా బాధపడుచున్నారు. నేను పోయి ప్రభుత్వంతో విన్నవించకముందే తమకు కావలసిందేదో ప్రాసిఇస్తామని గూడా వారు వాగ్దానం చేశారు. తమమీద వచ్చిన ఆరోపణలన్నీ సత్యదూరమనీ అతిశయోక్తులతో నిండిఉన్నాయని కూడా వారు అన్నారు. యూనియన్‌లో నివసించే మహమ్మదీయులతో గాని మరే మతవర్గం వారితో గాని తమకెట్టి వైరుధ్యమూ లేదని అన్నారు. ప్రభుత్వ చట్టానుగుణంగా వర్తించే పౌరులుగా ఉండాలని వారెంతో ఆతురత పడుతున్నారు.

### చర్చలు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 11: ఈరోజు సాయంత్రం గాంధీమహాత్ముణ్ణి సందర్శించడానికి ఇండియా మంత్రులున్నూ ఇంకా ఇతర నాయకులున్నూ వచ్చినారు. వారితో గాంధీజీ చాలాసేపు ఆయా విషయాలు చర్చించినాడు. ఆయన దర్శనంచేసి మాటలాడడానికి సిక్కునాయకులున్నూ వచ్చినారు. వారు ఢిల్లీనగరములో సిక్కులు కృపాణములు ధరించకూడదని ప్రభుత్వమువారుచేసిన ఉత్తరువు గురించి చర్చించినారు.

గాంధీజీ సందర్శించినవారిలో ముఖ్యులు, ప్రధానామాత్యుడు నెహ్రూ పండితుడు, సర్దార్ పటేలు, మౌలానా అబుల్ కలాం ఆజాద్, రాజకుమారి అమృతకౌర్.

భారతదేశములో పాకిస్థాన్ ప్రభుత్వ హైకమీషనరుగా పనిచేస్తున్న జాహిద్ హుస్సేన్ గాంధీజీని ఈసాయంత్రం సందర్శించినాడు. ఆయన ఢిల్లీ పరిస్థితులను గురించిన్నీ కాందిశీకుల సమస్యలను గురించిన్నీ చర్చించినట్టుగా తెలుస్తూ ఉంది. ఈ సందర్భంలో భారతదేశ ప్రభుత్వం వారు సంపూర్ణమైన సహకారం చేస్తూ ఉన్నట్టుగా జాహిద్‌హుస్సేన్ చెప్పినాడు. ఆయా ప్రదేశాలలో మెజారిటీ వర్గం తమను బాధిస్తారనే భయముతో

(2-వ పేజి చూడుడు)

## కరాచీనుంచి నౌకలలో కాందిశీకులప్రయాణం

కరాచీ, సెప్టెంబరు 11: కరాచీ నుండి మైనారిటీవర్గాల వలస విపరీతంగా సాగుతోంది. బి ఐ. ఎస్ ఎన్; బి ఎస్. ఎన్. నౌకా కంపెనీలవారు తమ ఓడలను అధికంగా ఇందు కోసమే ఉపయోగిస్తున్నాయి. మొదటిది కరాచీనుండి బొంబాయికి, రెండవది ఓఖా రేవుకూ అల్పసంఖ్యాకులను జేరవేస్తున్నాయి.

ఢిల్లీ నుంచి రావడంతోనే ఆర్. కె. సిద్వాగారు కంపెనీ మానేజిమెంటు వారితో సంప్రతించి సక్రమంగా వలస సాగించడానికై ఓడల సహాయం స్వీకరించారు. ఆయన అధ్యక్షతన పౌరప్రతినిధి సంఘం ఒకటి ఏర్పడింది. టిక్కెట్లు అమ్మకంలో దొంగవ్యాపారం సాగకుండా చెయ్యడానికి పౌరసంఘమే వ్యక్తుల అర్హతనుబట్టి అమ్మే ఏర్పాటు చేశారు.

కాంబెర్రా, సెప్టెంబరు 11: కార్బన్ యాసిడ్ గ్యాసుతో తయారుచేసిన ఒకపదార్థాన్ని కొన్నిరకాల మేఘాలమీదచల్లి కృత్రిమంగా వర్షం కురిపించాలని ప్రయత్నం చేస్తున్నట్లు ఆస్ట్రేలియా వైజ్ఞానిక పరిశోధక సంఘం ఇవ్వాళ ప్రకటించింది.

## పర్షియా స్వాతంత్ర్యానికి ఏ విధమైన భంగం రాదని హామీ

### పెట్రోలు గనుల విషయంలో ఎవరైనా నిర్బంధిస్తే అమెరికా తోడ్పడుతుందట

టెహరాన్, సెప్టెంబరు 11: "పర్షియా వస్తుసంపద పర్షియాదే! తన కిష్టమయితే అది ఎవ్వరికైనా ఊరికే నే ఇవ్వవచ్చు. లేకుంటే ఎంత ఖరీదు ఇస్తామన్నా ఎవ్వరికీ ఇవ్వకపోవచ్చు" అని పర్షియాలో అమెరికా రాయబారి జార్జి ఎల్లెన్ నేడొక సమావేశంలో ప్రకటించాడు.

వ్యాపార విషయకంగా గాని మరేవిధంగా గాని అమెరికా ఎటువంటి సూచనలూ చెయ్యబోవడం లేదనీ, కాని అటువంటి సూచనలు ఎవరైనా బెదిరిస్తూ చేసేటట్లయితే తాము గూడా పట్టించుకోవలసి వస్తుందనీ ఆయనఅన్నాడు.

"పరపీడనా భయంనుండి ప్రపంచ ప్రజలను సంరక్షించాలని అమెరికా బద్ధకంకణమైంది. పర్షియా విషయంలో కూడా మేము ఇటువంటి విధానాన్నే అవలంబిస్తాము. పర్షియా ప్రజలు తమ ఇష్టంవచ్చినట్టు ప్రవర్తించేందుకు అమెరికా తప్పక సహాయం చేస్తుందని వారు విశ్వసించవచ్చు" అని కూడా ఆయన పర్షియనులకు హామీ ఇచ్చాడు.

ఈ ప్రకటన సరిగ్గా సోవియట్ పర్షియా సంయుక్త కంపెనీ స్థాపనకు వచ్చిన సూచనలను మజ్లిస్ (శాసనసభ) చర్చించబోయే సమయంలోనే వచ్చింది.

1946 లో రష్యాలో పర్షియా చేసుకున్న ఒడంబడికను పర్షియన్ పార్లమెంటు ఇంతవరకూ ఆమోదించలేదు. 1946 మార్చి 24 తర్వాత ఏడునెలలు దాటకుండా పార్లమెంటు ఆమోదానికి ఈ ఒడంబడికను నివేదించాలని అందులో నే ఒక షరతు కూడా ఉన్నది.

సోవియట్ రాయబారి ఇటీవల పర్షియా ప్రధానిని మూడు పార్లు చూశాడు. ఒకసారి పర్షియా రాజును కూడా సందర్శించాడు.

సోవియటు ప్రభుత్వం వ్రాసిన ఒక లేఖను ఆయన పాస చదివి వినిపించాడనీ అందులో ఏ మాత్రమూ ఆలస్యం చెయ్యకుండా శాసనసభాయిదాను పార్లమెంటుకు నివేదించమేకాక అది పూర్తిగా 1946 ఒడంబడికను అనుసరించాలని గూడా ఉన్నట్లు విశ్వసనీయ వర్గాల ద్వారా తెలిసింది.

### బ్రిటిషువారి యెత్తులు

1907 లో జరిగిన ఆంగ్లో రష్యనుసంధి పద్ధతిలో పర్షియాను బ్రిటను ప్రాంతమనీ, రష్యా ప్రాంతమనీ విభజించుకుని నూనెను లను వాడుకోవాలన్న ఉద్దేశంతో బ్రిటను రష్యాలు రహస్యంగా సంప్రతింపులు సాగిస్తున్నాయని టెహరాన్ వార్తాపత్రిక "ఎట్టెలాఎట్" ప్రకటించింది.

## యూరప్ పునరుద్ధరణ

### అంతర్జాతీయబ్యాంకు బాధ్యత: బ్రిటిష్ ఖజానామంత్రి హెచ్చరిక

లండన్, సెప్టెంబరు 11: అంతర్జాతీయ బ్యాంకు ద్వితీయ వార్షిక సమావేశమునకు 300 కు పైగా ఆర్థికవేత్తలు ప్రతినిధులు హాజరైరి. ఈ సమావేశమునకు బ్రిటిష్ ఖజానా శాఖ కార్యదర్శి డా॥ హ్యూడాల్టన్ అధ్యక్షత వహించెను. డా॥ డాల్టన్ మాట్లాడుతూ "ప్రస్తుత పరిస్థితి మనకందరకూ ఒక సవాలు" అనెను:

"పరిస్థితులు మన అంచనాలను భగ్నం చేసినవి. గత కొద్దినెలలనుండి ఆర్థిక పరిస్థితి అవకాశాలు చాల విపరీతంగా పరిణమించాయి. పునర్నిర్మాణావసరములు అనుకున్నదానికన్న ఎంతో ఎక్కువగా పెరిగిపోయినవి. దీనికితోడు అమెరికాలో ధరలు పెరిగిపోవటంవలన 1945, 46 సంవత్సరాలలో పుచ్చుకున్న అప్పుల కొనుగోలుశక్తి పడిపోయింది. ఈనాడు అన్ని దేశములకు అత్యవసరంగా కావలసిన వస్తువులు దిగుమతి చేసికొనుటకు కావలసిన ధనం కొరతగావున్నది. ఇందువలన ఇప్పటివరకు సాధించిన ఆర్థికపునరుద్ధరణ నిరుపయోగమై పోగలదు. ఈ బ్యాంకు ఆర్థిక పునరుద్ధరణకు సహాయం చేసి యూరప్‌లో అధికోత్పత్తికి, అధిక అంతర్జాతీయ వ్యాపారానికి దోహదం చేసి, అంతర్జాతీయంగా ఆర్థిక నిశ్వాసం నెలకొల్పగలదని నే నాశిస్తున్నాను." అని డా. డాల్టన్, ఉపన్యసించెను. అమెరికా అరువు-కాలం చట్టంవంటిదే ఇప్పుడు కూడా అవలంబించవలెనని బెవిన్ నిన్న సూచించినతరువాతనే డా. డాల్టన్ ఉపన్యాసంజరిగెను. ఈ సమావేశమునకు 45 దేశములకు చెందిన 300 మంది ప్రతినిధులు హాజరైరి. 24 విషయములను గురించి చర్చించవలసిన ఈసమావేశం 15 రోజులు జరుగవచ్చును. భారతదేశ విభజనవలన, రిజర్వుబ్యాంకువిభజనవలన ఏర్పడినకొత్త పరిస్థితినికూడా ఈసభలో చర్చిస్తారు.

ప్రధాని క్లిమెంట్ అట్లీ ఈ సమావేశమునకు శుభసందేశం పంపిస్తూ, అంతర్జాతీయ ఆర్థిక సహకారం లేనిదే ప్రపంచ ఆర్థిక పరిస్థితి చక్కబడదని చెప్పెను. ఈ సమావేశం, చాలరు కొరతనుగూర్చి చర్చించును. కాని ఈ సమావేశము లన్నియు రహస్యముగానే జరుగును.

లండన్, సెప్టెంబరు 12: అధికోత్పత్తి, ఎక్కువ ఎగుమతుల విధానములనుగూర్చి వాణిజ్యశాఖామంత్రి సర్ స్టాఫర్డ్ క్రిప్స్ రేపు ప్రకటించవున్నాడు. 3 వేలమంది యజమానుల, కార్మికుల ప్రతినిధులు సమావేశమైన సభలో సర్ స్టాఫర్డ్ క్రిప్స్ ఈ ప్రకటనచేయును. ఎగుమతుల మొత్తములను నిర్ణయించటం, కార్మికులను ఒక పరిశ్రమనుండి ఇంకొకదానిలోనికి మార్చటం మొదలగు విషయాలను ఈయన [illegible]

## అమెరికన్ ధాన్యపు ఎగుమతుల తగ్గింపు

వాషింగ్‌టన్, సెప్టెంబరు 11: [illegible] రాజ్యములలోని అమెరికన్, రాయబారలకు ఉత్తరువులు పంపబడినవి.

చికాగోలో ధాన్యంగర రోజూ బుషేల్‌కు 10 సెంట్లు పెరిగిపోతూ వేవుంది. కందుల ధర యిదివరకెన్నడూ లేనంత ఎక్కువగా వున్నది. ఇదివరకు ధర పెరిగి పోవటం వలన బ్రిటన్ అప్పుడు పట్టిన గతియే ఇప్పుడు ధరలు పెరిగిపోవటంవలన మార్షల్ పథకమునకు కూడా పట్టాలను.

## గంటల పంచాంగం

సర్వజిత్ సం॥ని. శ్రావ॥బ॥త్రయో॥ 1947 సం॥ సెప్టెంబరు 13 శనివారం త్రయోదశి ఉ 6 56 పిమ్మట చతు తె 4-50 మఖ రా 12-50 వర్జ్యం ప 2-0 ల 8-26 వ
బ॥అమా॥ సెప్టెంబరు 14 ఆదివారం అ॥ అమా రా 1 0 పూర్వ రా 10-44 వర్జ్యం ప 8-8 ల 9-36 వ.

ఆంధ్రపత్రిక
సర్వజిత్ సం॥ని. శ్రావ॥బ॥త్రయో॥
శనివారము

# ఆహారస్థితి

మేము ఇదివరకనేకపర్యాయములు సూచించినట్లు, ధాన్యసేకరణ జయప్రదము కాకపోవుటకు ఉత్పత్తిదారునకు ప్రోత్సాహకరమైన ధర లేకపోవుటయే ప్రధాన కారణమని ఈమధ్య వెలువడిన ప్రజాభిప్రాయమునుబట్టి మరొకసారి నిర్ధారణ అయినది. మంత్రివర్గము అవలంబించిన కొన్ని పద్ధతులపట్ల తీవ్రనిరసనము తెలిపినప్పటికి, రాష్ట్రకాంగ్రెసు తీర్మానము మేము తెలిపిన అంశమునే బలపరచుచున్నది. ప్రభుత్వము నిర్ణయించిన ధాన్యపుధర తగినంతగా లేదని మంత్రులుకూడ అంగీకరించిరి. కాని ధాన్యపుధరను పెంచుటకు వారికి కేంద్రప్రభుత్వ అనుమతి కావలసియున్నది. కేంద్రప్రభుత్వము మాత్రము ఇంతవరకును రాష్ట్రప్రభుత్వ సూచనను అంగీకరించి యుండలేదు. రాష్ట్రప్రభుత్వము తనకుతానై ధరను హెచ్చింప సాహసించవచ్చునా అనునది ఆలోచనీయము. బోనసు పద్ధతి, కేంద్రప్రభుత్వ నిర్ణయమును తప్పించుకొని ధరపెంచుటయని ఇదివరకే విమర్శకు పాత్రమైనది. విదేశములనుండి దిగుమతి అయిన ధాన్యమునకిచ్చు ధర స్వదేశ ఉత్పత్తిదారులకు ఎందుకు ఇవ్వకూడదను వాదించెడివారు ఒక సంగతిని గమనించవలసియున్నది. విదేశీయులకు వర్తకదృష్ట్యా డబ్బే ప్రధానము గాని, మనదేశావసరముల గురించి వారికి బాధ్యతలేదు. అదీకాక ఉత్పత్తిదారునికిచ్చు ధరను పెంచిన, వినియోగదారు ఇవ్వవలసిన ధరను అతని అందుబాటులో ఉంచవలసిన అవసరమున్నది. దానికిగాను ప్రభుత్వము తిరిగి సబ్సిడీ నివ్వవలసియుండును.

ధర అనునది ప్రధానకారణమైనప్పటికీ, ధాన్యసేకరణ విధానము తృప్తికరముగ జరుగకపోవుటకు ఇతరకారణము లున్నవని మరచుటకు వీలులేదు. మంత్రివర్గము, కాంగ్రెసునాయకులు కలసి సమష్టిగ ప్రయత్నము చేయుటలేదని అందరికి తెలిసినవిషయము. ఈ ప్రయత్నలోపమునకు కారకు లెవ్వరని నిర్ణయించుటకు వీలులేదు. మంత్రులు ఆఖరిగడియలో పర్యటన ఆరంభింపక ఆదిలోనే తమ కృషిని ప్రారంభించి స్థానిక నాయకుల సహకారమును పొందిన ఇంత విపరీతస్థితి వచ్చియుండెడిది కాదు. కేవలము అధికార సిబ్బంది మీదనే ధాన్యసేకరణకు ఆధారపడియుండెనని చెప్పవలసియున్నది. [ప్రతిపక్ష ... ప్రభుత్వము] నపుడు కార్యసాధనకు ప్రధానముగా ప్రజాసహకారమే సాధనముగా నుండవలెను. అట్టిది జరుగునటుల చూచుట ప్రజాపక్షముల బాధ్యతకూడ అయి యున్నది. ధాన్యసేకరణకు బలప్రయోగమును చేయవలసి వచ్చునని ప్రధాని రామస్వామిరెడ్డిగారు—(అది నిజమైన) అనవలసినమాట కాదు. ఆయన ప్రకటనను ఆంధ్రనాయకులు నిరసించిన అది స్వాభావికము. బలప్రయోగము చేయవలసి వచ్చుననుటకు బదులు, ఆంధ్రప్రజకు విజ్ఞప్తిచేసి, నాయకులతో కూడ సంప్రతింపులు జరపిన చక్కగ నుండెడిది. కార్యసానుకూలమునకు అనుకూలముగ నుండెడిది. మంత్రుల పర్యటన మూలమున ఆయాజిల్లాలందు రైతులు తమకుతామై ధాన్యమును వప్పచెప్పుటే ఇందుకు నిదర్శనము. "ఏ ప్రభుత్వము ఎంత అత్యల్పముగా పరిపాలించునో అది అంత ఉత్తమ ప్రభుత్వము." కాగలదన్న సిద్ధాంతము సర్వత్రా అంగీకరింపబడినది.

ప్రధాని ప్రకటనకు నిరసన తెలుపుచూ రాష్ట్రకాంగ్రెసు నిలువధాన్యమును వప్పగించి రాష్ట్రము నెదుర్కొనిన క్లిష్ట ఆహారపరిస్థితిని తొలగించవలెనని విజ్ఞప్తిచేసినది. ఆంధ్ర రైతాంగము ఈ విజ్ఞప్తిని గణుతింతురనుటకు తమవద్ద మిగిలియున్న ధాన్యమును ఇత్తురనుటకు సందేహములేదు. పరస్పర మమత్వము బట్టుటకు ఇది అదనుకాదు. ప్రజను క్షామమునుండి తప్పించుట ప్రథమకర్తవ్యము. రాష్ట్రకాంగ్రెసు తన తీర్మానమును అట్టిభావముతోనే చేసినది. ప్రక్కతమిళ ప్రాంతములు తాము ఇవ్వవలసిన ధాన్యమును ఇవ్వగా కొద్ది ధర కొరకు ఆంధ్రజిల్లాలు తమ విధ్యుక్తమును నెరవేర్చలేదను నిందను ఎట్టిసందర్భమునను రానివ్వకూడదు. మంత్రులెవరైనప్పటికి మంత్రివర్గము కాంగ్రెసుది.

## ఇండోనేసియా దేశద్రోహులు

హేగ్, సెప్టెంబర్ 11: "ఇండోనేసియన్ రిపబ్లిక్ అధికారంకిందవున్న ప్రాంతాలలో అరాచకం, విధ్వంసం తాండవిస్తున్నవి. ప్రజల సౌభాగ్యాన్నిగాక తమ అధికారబలాన్నే ప్రధానంగా రిపబ్లికన్ నాయకులు చూచుకొనటంవల్ల ఆ పరిస్థితులు వచ్చినవి," అని డచ్చి ప్రధాని డా॥ లూయీ బేల్, తూర్పు ఇండోనేసియా, బోర్నియోల ప్రతినిధులతో ఈవిధంగా అన్నాడు.

"డచ్చి కామన్వెల్తులో భాగంగా ఇండోనేసియా రాష్ట్రాల ఫెడరేషన్ను సాధ్యమైనంత త్వరలో నిర్మిస్తాము. ఇందులో సురినామ్, ఆంటిల్ ద్వీపాలుకూడా వుంటవి. రిపబ్లిక్ 'దౌర్జన్యం నుంచి రక్షించబడ్డ' వివిధ వర్గాలూ భవిష్యత్రాజ్యాంగంలో తమ స్థానాన్ని భద్రపరచుకునేటందుకు రాజకీయ సంస్థలను నిర్మించుకోవాలి." అని అతడు అన్నాడు.

తూర్పు ఇండోనేసియా ప్రభుత్వ అధ్యక్షుడు సేకావతి, తన ప్రాంతంలో శాంతిభద్రతలు నెలకొల్పబడ్డవని అన్నాడు. "డచ్చివారు మీయెడల చూపిన వైఖరిని బట్టి 'ఇండోనేసియా సంయుక్త రాష్ట్రాలను' ఏర్పరిచేందుకు డచ్చివారు సిద్ధంగా ఉన్నారని మాకు నమ్మకం కలిగించింది," అని అతడు అన్నాడు.

డచ్చివారి విమానాలు రిపబ్లిక్ ప్రాంతాలపైన గస్తీతిరుగుతున్నవనీ, పడమటి జావాలో కొన్ని సైనిక సంఘర్షణలు జరిగినవనీ రిపబ్లికన్ వార్త ప్రకటించింది.

యుద్ధవిరమణ విషయమై పరిశీలిస్తున్న కౌన్సిల్ సంఘ సభ్యుడు చార్లెస్ ఈటన్, డచ్చిప్రాంతాలను పర్యటిస్తుండగా అతనిమీద కాల్పులు జరిగినవి.

రంగూన్, సెప్టెంబర్ 11: బర్మా ప్రధాన రాజకీయపక్షం, ఫాసిస్టు వ్యతిరేక ప్రజాస్వాతంత్ర్య సంఘంలో అవినీతికరు లందరినీ తొలగించేందుకు పార్టీ ఒక ప్రత్యేకసంఘాన్ని నియమించింది.

## బ్రిటిషు మంత్రివర్గంలో మార్పులు
### నవంబరులో జరగవచ్చు

లండన్, సెప్టెంబరు 11: అక్టోబరు 20 న పార్లమెంటు సమావేశం జరిగేలోపుగానే బ్రిటిషు ప్రభుత్వంలో కొన్ని మార్పులు రావచ్చునని లండనులో అభిజ్ఞవర్గాలు ఇవ్వాళ అంగీకరించాయి.

దీనివల్ల పరిపాలనలో అంత ప్రాముఖ్యం వహించని కొందరు సభ్యులకు స్వస్తి చెప్పడం సంభవించునని రాయిటర్ రాజకీయవిలేఖరి వ్రాస్తున్నాడు.

దస్త్రంలేనిమంత్రి ఆర్థర్ గ్రీనువుడ్, రక్షణమంత్రి అలెగ్జాండర్, పంటమెలకు, విద్యుచ్ఛక్తి మంత్రి షిన్‌వెల్—వీరిని గూర్చి విపరీతంగా ఊహాగానం సాగుతోంది.

నవంబరులో లండనులో జరగవలసిన అగ్రరాజ్య చతుష్టయ విదేశాంగ మంత్రుల సమావేశం అయినతర్వాత బ్రిటిషుమంత్రివర్గంలో చాలా పెద్దమార్పులు జరుగుతాయని రాజకీయపరిశీలకులు భావిస్తున్నారు.

## ఈజిప్టు పిర్యాదు: ప్రతిష్టంభన
### నిరసన ప్రదర్శనాలు

లండన్, సెప్టెంబరు 11: ఈజిప్టు వివాదం విషయంలో భద్రతామండలిలో ప్రతిష్టంభనవచ్చి ఏదీ నిర్ణయంకాలేదు. ఆ విషయమై ఇరుపక్షాలవారికీ సమ్మతంగా వుండే కొత్త ఒడంబడికను చేసుకొనటమునేది ఒక్కటే తగిన ఉపాయమని ఒక బ్రిటిషు విదేశాంగ శాఖోద్యోగి ఈ వేళ ప్రకటించాడు.

ప్రతిపాదనలు సాగటానికి అనుకూలంగా ముందు బ్రిటిషుసైన్యాలన్నిటినీ ఖాళీచేయాలని సిరియా భద్రతామండలిలో సూచించింది. లెబనాన్, సిరియాల విషయంలో ఫ్రాన్సు ఈవిధంగానే ప్రవర్తించింది. ఈ విషయమై ఆ ఉద్యోగిని రాయిటర్ విలేఖరి ప్రశ్నించగా అతడు ఈవిధంగా అన్నాడు: "ఈ రెండు విషయాలకు పోలికలేదు. బ్రిటన్, ఈజిప్టులకు అంతకు క్రితంచేసుకొని, అమలులోవున్న ఒడంబడికవున్నది. ఆ దేశాలతో ఫ్రెంచి వారికి అటువంటి ఒడంబడికలేదు."

కెయిరో, సెప్టెంబరు 11: ఈజిప్టు పిర్యాదు విషయమై భద్రతాసంఘంలో వచ్చిన ప్రతిష్టంభనకు అసమ్మతి తెలుపుతూ ఈవేళ కెయిరో, అలెగ్జాండ్రియా, పోర్టుసయ్యద్ మొదలైన ప్రాంతాల్లో ప్రదర్శనలు జరిగినవి. భద్రతాసంఘం నశించాలి, "బ్రిటన్ నశించాలి" అని నినాదాలుచేస్తూ అలెగ్జాండ్రియా నూలు మిల్లు పనివారు 4000 మంది ప్రదర్శనలు జరిపారు. ఈసందర్భంలో జరిగిన సంఘర్షణలో చాలమంది పనివారూ, పోలీసులూ గాయపడ్డారు.

పోర్టుసయ్యద్‌లో ప్రదర్శకులు గుంపులుగాచేరి బ్రిటిషు క్లబ్ మీద, స్కూలుమీద, అమెరికా బ్రిటిషు కౌన్సల్ కార్యాలయాలమీదా రాళ్లుకొట్టారు. బ్రిటిషు కౌన్సల్ కార్యాలయాన్ని ధ్వంసంచేయాలని చూశారు గాని పోలీసులు అడ్డుపడ్డారు. దుకాణాలన్నీ మూసివేశారు. ప్రజలు విక్టోరియా రాణివిగ్రహం మీదా అమెరికన్ల, బ్రిటిషువారి భవనాలమీదా కూడా రాళ్లుకొట్టారు.

కెయిరోలో వీధుల్లో పోలీసులు ఇనపటోపీలలో తిరుగుతున్నారు. గవర్నమెంటు ప్రెస్సు పనివారు 3000 మంది సైతాను సమ్మెను ఒక గంట సేపు చేశారు. విద్యార్థులనూ, పోలీసువారినీ, మిలిటరీవారినీ, ప్రజలనూ తిరుగుబాటు చేయమని అలెగ్జాండ్రియాలో కరపత్రాలు పంచిపెట్టారు. వారిలో చాలామంది అరెస్టు అయినారు.

## శ్రీ దువ్వూరి రామిరెడ్డి గారి మృతి
### నెల్లూరులో 12-వ తేదీ ఉదయం

నెల్లూరు, సెప్టెంబర్ 12: కవికోకిల శ్రీ దువ్వూరి రామిరెడ్డి గారు నేడుఉదయం పరమపదించారు. వీరి వయస్సు 52 సంవత్సరాలు.

శ్రీ రెడ్డిగారు వ్రాసిన 'పానశాల' "కుంభరాణా" "పతితకేళము" పండితపామరుల మెప్పు పొందాయి. ఇంకా ఎన్నో అముద్రితరచనలున్నాయి. 'చిత్రనళీయం' ఫిలిముకు కవిగా, దర్శకుడుగా పని చేశారు. వీరి మృదుమధుర శైలికి మెచ్చుకొని విజయనగరం విద్వాంసుల పరిషత్తువారు 'కవికోకిల' బిరుదమిచ్చారు.

శ్రీ రెడ్డిగారికి భార్య, ఇద్దరు కుమారులూ ఉన్నారు (స్వ. వి.)

## ఢిల్లీ పరిస్థితి
[1 వ పేజీ తరువాయి]

పారిపోయివచ్చిన కాందిశీకులను తిరిగివారివారి ప్రదేశములకు పోవడానికి ప్రోత్సహించవలెనని గాంధీమహాత్ముడు జవహర్‌లాల్ నెహ్రూకు సూచించినట్లుగా తెలుస్తూ ఉంది.

న్యూఢిల్లీ, సెప్టెంబరు 11: "ఢిల్లీలోనూ చుట్టుప్రక్కలాగూడా పరిస్థితి చాలావరకు అదుపులోకి వస్తున్నది. పూర్తిగా పరిస్థితి స్థిరంగా లేకపోయినా చాలా అభివృద్ధిమాత్రం ఉన్నది" అని అత్యున్నత సైనికాధికారి ఒకడు నేటి పత్రికా సమావేశంలో వెల్లడించాడు.

పంజాబులో కూడా విద్వేషాగ్ని తాత్కాలికంగా ఉపశమించింది. కాందిశీకుల ప్రవాహం అటూ ఇటూ సాగుతూనే ఉన్నది. సాయుధముఠాలు కొన్ని శరణార్థుల నటకాలనుంచి ప్రాణనష్టం కలిగిస్తున్నాయిగాని సైన్యాలు వారిని నిర్మూలిస్తూనే ఉన్నాయి.

పంజాబ్ శిబిరాలు కొన్నింటిలో అప్పుడే కలరా వచ్చినట్లు తెలుస్తున్నది. కాసూరు శిబిరంలో 4000 మందికి కలరా వ్యాధి అంటుకొన్నది. నాటికి పదిమంది చనిపోయి ఉంటారు. లాహోరు వెలుపలా, బహావల్‌పూర్ ప్రాంతంలోనూ కలరావచ్చింది.

సిమ్లాలో ప్రశాంతంగానే ఉన్నదికాని జిల్లా అధికారులు దోపిడీలూ కత్తిపోట్లూ మళ్లీ సాగుతాయేమో అని భయపడుతున్నారు. గత మూడు రోజులలోనూ జరిగిన సంఘర్షణలు కాందిశీకులవల్లనే జరిగాయని అంటున్నారు.

పెషావరులో మూడు రోజులక్రితం కల్లోలం ప్రారంభమైనట్లు తెలిసింది. మిలిటరీ డెయిలీ ఫారమ్ ప్రాంతంలో 30 మంది సిక్కులను చంపివేశారు. ఒకచోట సైనికులూ సైనికులూ ఒకరిమీద ఒకరు కాల్చుకున్నారు. పట్టణం వెలుపల పరిస్థితి ఇంకా భయంకరంగా ఉన్నట్లు తెలుస్తోంది. పెషావరు కాందిశీకులందరూ కోటలోనే ఉంటున్నారు. పరస్పర విరుద్ధమైనవార్తలు వస్తూఉండడంచేత విద్వేషాగ్ని విపరీతంగా ఉన్నదనిమాత్రం చెప్పడానికి వీల్లేదు హిందూ ముస్లిం సైన్యాలు ఘర్షణపడడం లేదు గాని అఫ్రిడీజాతివారే దోపిడీలు చేస్తున్నారు.

అంబాలా కోటక్ డివిజన్లు కొంచెం బాగున్నాయిగాని ఫిరోజ్‌పూర్‌లో ఇంకా సంక్షోభం నెలకొంటూనే ఉన్నది. కురుక్షేత్రంవద్ద ఉన్న శిబిరంలో 5 లక్షలమంది శరణార్థులున్నారు. ఈ శిబిరం ఇప్పుడిప్పుడే ఏర్పడింది.

పాకిస్తాన్‌లో భావల్పూర్ సంస్థానానికి లక్ష ఇరవై వేల శరణార్థులు వచ్చారట. వారిని కపుర్థలావద్ద కొన్ని ముఠాలు అటకాయించారు.

మాంట్‌గామెరీ గడచిన 24 గంటలలో శాంతంగానే ఉన్నది. 20 వేలమంది కాందిశీకులు సుతేలుకి బ్రిడ్జిదాటి వెళ్లారు.

### చక్కబడుతున్నవి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 11: పంపిణీ వ్యవస్థ యిప్పుడు చక్కబడుతూ ఉన్నందువల్ల ఢిల్లీ ఎమర్జెన్సీ కమిటీవారు ఇప్పుడు ఢిల్లీ నగర నిత్య జీవనము యథాస్థితముగా ఉండేటందుకు చేయవలసిన సదుపాయాలను గురించి ఆలోచిస్తున్నారు.

ఈ కమిటీవారు ఈ రోజు 11 గంటలకు సమావేశము అయినారు. వాణిజ్యశాఖామంత్రి సి. హెచ్. భాబ అధ్యక్షత వహించినాడు. ఈ కమిటీ సభ్యులతోపాటు అనేక అనధికారసంస్థల ప్రతినిధులున్నూ, ఐచ్ఛిక సంఘాల ప్రతినిధులున్నూ జిల్లా అధికారులున్నూ కేంద్ర ప్రభుత్వాధికారులున్నూ ఈ సమావేశములో పాల్గొన్నారు. గోలుమార్కెట్ నుంచి తిండి గింజలను మిలటరీ కాపలాతో గిడ్డంగులకు చేర్పించే టందుకు జరిగిన ఏర్పాట్లను గురించి ఈ కమిటీవారు యోజించినారు. శవాలను వెంటనే ఆయా ప్రదేశాలలో నుంచి తీసివేయించే ఏర్పాట్లను గురించిన్ని ఆయా వీధులను వెంటవెంటనే శుభ్రము చేయడాన్ని గురించిన్ని చర్చించినారు. ఈ పని ఇదివరకే ఒకపద్ధతిన ప్రారంభించడము అయింది.

ఈ ఈ పనులను అనధికార సంఘాలవారున్నూ మిలటరీవారున్నూ నిర్వహించేటందుకు చాలినంత సాయము చేయడానికోసము యూనివర్సిటీ విద్యార్థి సైనిక దళమువారినీ ఆక్జిలియరీ బలగాన్నీ సమీకరించ నిశ్చయించినారు.

కాంగ్రెసు అధ్యక్షుడి పతినుచేత కృపలానీ కాందిశీకుల శిబిరాలను చూసి ఆయా కాందిశీకుల అత్యవసరాలను గురించి తెలియచేసింది. తిండిగింజలను ఆయా స్టేషనుల నుంచి తెప్పించే ఏర్పాట్లు అయిపోయినవి. వెంటనే కాందిశీకుల శిబిరాలకు తిండిగింజలు సరఫరా అవుతవనీ సివిల్ సప్లయిస్ అధికారి చెప్పినాడు.

ఢిల్లీనగర జీవనము తారుమారయిపోవడానికి భయభ్రాంతే ఎక్కువగా కారణము అని యీకమిటీ వారు అభిప్రాయపడినారు. ఈ భయభ్రాంతిని, ప్రజలలో పోగొట్టడానికి సరిఅయిన వర్తమానాలను ప్రజలకు తెలియచేయవలసినదని ... అందరూ సహకారము చేయవలెనని ... కోరినాడు.

స్థితిగతులు చక్కబడుతూ ఉన్నందువల్ల కర్ఫ్యూ ఉత్తరువులను జిల్లా మేజిస్ట్రేటు సడలించినాడు.

ఢిల్లీనగరానికి చుట్టుప్రక్కల ఉన్న గ్రామాలనుంచి పాలు సరఫరా అవుతూ ఉంటవి. ఇప్పుడు కర్ఫ్యూ అమలులో ఉన్నందువల్లనూ భయమువల్లనూ పాలవాండ్లు ఢిల్లీకి పాలుసరఫరా చేయకుండా ఉన్నారు. అందువల్ల ఆయా గ్రామాలలో పాలు పోగుచేసి ఆ ప్రాంతములకున్నూ కర్ఫ్యూను సడలించని ప్రదేశాలకున్నూ సరఫరా చేయడానికి ప్రభుత్వమువారు ఒక ప్రత్యేకపు ఏర్పాటుచేయడానికి ప్రయత్నము చేస్తున్నారు.

### పటేల్ ప్రభృతుల పర్యటన

సర్దార్ పటేల్, సి. హెచ్. భాభా, శ్యామప్రసాద్ ముఖర్జీ గార్లు ఢిల్లీలో కొన్ని కల్లోలిత ప్రాంతాలకు వెళ్లి చూచి వచ్చారు. సర్దార్ పటేల్ కొన్ని పోలీస్ స్టేషనులను హఠాత్తుగా దర్శించారు.

పార్లమెంటు స్ట్రీటుపోలీసుస్టేషను అధికారి తన డివిజనిలో మిక్కిలి ప్రశాంతంగా ఉన్నదని మంత్రులతో చెప్పాడు.

గత వారంలో మిక్కిలి ఎక్కువగా సంక్షుభితమైన పహరగంజ్ ప్రాంతంలో పోలీసులు చాలా తీవ్రంగా కృషి చేస్తున్నారు. దుండగుల నుండి స్వాధీనంచేసుకున్న ఆనేకాయుధాలనూ, బాంబులనూ పోలీసులు మంత్రులకు చూపించారు.

ఈ ప్రాంతంలోనే ఒకదుర్మార్గుడు ఒక రాత్రి అంతా మరతుపాకి కాలుస్తూనే ఉన్నట్లు తెలిసింది. మందు అయిపోయేవరకూ కాల్చడం ఆగలేదట. ఉదయమే పోలీసులు ఆ తుపాకీనీ, ఆ వ్యక్తినీ కూడా పట్టుకున్నారు. ఇక్కడికి సమీపంలో సుమారు 8000 మంది శరణార్థులున్నారు. వారి కన్ని సౌకర్యాలూ కల్పింపబడుతున్నాయి. వీరిని త్వరలోనే పురానా ఖిల్లాకు పంపుతారు.

అతర్వాతమంత్రులు టౌన్‌హాలుకు వెళ్లి అక్కడనుంచి పురానా ఖిల్లాకు వెళ్లారు. ఖిల్లాలో 20,000 మందిబాధితులున్నారు. వారి కందరికీ ప్లాగు కింటిని రేపట్లు ఇస్తున్నారు.

రక్షణార్థులకు సోడా వెయ్యగా చాలా కువారులా మందు సామగ్రి దొరికినట్లు కేంద్రస్థానం వారు తెలియజేశారు. రేపటి నుంచీ మరింత తీవ్రంగా సోదాలు సాగిస్తారు.

కొన్ని ప్రాంతాల్లో పరిస్థితి బాగా అభివృద్ధి చెందినందువల్ల కర్ఫ్యూ నిబంధన సడలించాలని నిశ్చయించారు.

'ఫెయిజ్ బజార్' పోలీస్టేషను వద్దకు కూడా మంత్రులు వెళ్లారు. కొన్ని స్టేషనులలో ముస్లిం పోలీసు ఉద్యోగులు తమ విధిని మానివేసి వెళ్లిపోయినట్లు తెలిసింది.

ఇవ్వాళ ఢిల్లీనుంచి 8,500 మంది శరణార్థులు రైళ్లలో వెళ్లిపోయారు.

ప్రభుత్వోద్యోగుల కుటుంబాల రక్షణకు తగిన సన్నాహాలు జరుగుతున్నాయి.

ఆరోగ్యశాఖ అవసర పరిస్థితులలో ఉపయోగించేందుకు గలరామందు జాగ్రత్తపరచింది. తూర్పు పంజాబుకు వస్తున్న శరణార్థుల సహాయానికి లాహోరుకు మందులు పంపుతున్నారు.

జలందరు కంటోన్‌మెంటు రైల్వేస్టేషనులో శరణార్థులను తీసికొని వెడలుచున్న రైలుబండిలో ఎవరో ఒక చేతిబాంబును విసరిరి. దాని ఫలితముగా 14 గురు మరణించిరి.

### ఢిల్లీలో శాంతి

చిల్లరమల్లర పోట్లాటలలో బాకులతో పొడుచుకోడము జరిగినప్పటికిన్నీ అక్కడక్కడ ఇండ్లు తగలబెట్టినప్పటికిన్నీ ఢిల్లీలో వర్గకలహాలు అంతరించిపోతున్నవని జిల్లా మేజిస్ట్రేటు ప్రకటనము చేసినాడు.

ఈనాడు ఉదయము పహార్‌గంజ్ ప్రాంతములోనూ చౌరిబజారులో బాకులతో పొడుచుకోడము జరిగింది.

ఫతేపురి మసీద్‌దగ్గర ఒక ఇంట్లోనుంచి బయటికి తుపాకులుకాల్చడము మొదలుపెట్టినారు. తరువాత ఇల్లు సోదాచూడగా ఆయుధాలు కనిపించలేదు. వాటిని ఆ ప్రదేశమునుంచి మరిఒకచోటికి తీసుకొనిపోయినారో లేక అక్కడనే దాచిపెట్టినారో తెలియలేదు అందువల్ల ఆ ఇంటి దగ్గర పోలీసులు కాపలా ఉన్నారు.

కిందటిరాత్రి కాజీ పోలీసు స్టేషన్ మీద ఒక యింట్లోనుంచి తుపాకులు కాల్చినారు. పోలీసులున్నూ తిరిగి తుపాకులు కాల్చినారు. ప్రమాదము ఏమిన్నీ జరగలేదు.

నారలిటి సినిమా ప్రాంతాలలో బాంబులు ప్రేలినవి.

ఈరోజు ఉదయము కర్ఫ్యూ తీసే అయిపోగానే చాలామంది జనులు ఏదులలోకి పరుగెత్తుకొని వచ్చినారు. ఆసమయము లోపే బాకులతో పొడుచుకోడము జరిగింది. కర్ఫ్యూతీసే యిపోగానే దుండగులు చెలరేగకుండా ఉండేటందుకు పోలీసువారున్నూ మిలటరీ వారున్నూ బందోబస్తు అయిన ఏర్పాట్లు చేస్తున్నారు.

## ఢిల్లీకి కాందిశీకుల రాకపోకలు

ఢిల్లీనగర కలహాలనుంచి పడమటి పాకిస్తాన్ కాందిశీకులను ఢిల్లీకి విమానాలలో తీసుకొనిరావడము తగ్గించినారు. సెప్టెంబరు 7 వ తేదీనుంచి విమానాల మెకానిక్కులు మొదలయిన పనివాండ్లు పనులలోకి రాలేకపోయిన కారణమునుంచి కూడా ఢిల్లీనుంచి విమానాలు మితముగా ప్రయాణము చేయవలసి వచ్చినది. అయినా లాహోరు అమృతసర్ పట్టణాలమధ్య విమానాల సంచారము పూర్వముకన్నా నాటికి యూనైటెడుల ఎక్కువగా సంచారము చేస్తూఉన్నవి. ఈరోజునుంచి విమానాల అనధికార ప్రయాణములను తగ్గించి వేయ తలచినారు.

### గాంధీజీ ఆస్పత్రిని చూచినాడు

గాంధీమహాత్ముడు ఇండియా ప్రభుత్వ ఆరోగ్య శాఖా మంత్రిణి అయిన రాజకుమారి అమృత కౌరుతోనూ డాక్టరు సుశీల నయ్యారులతోనూ ఈరోజు సాయంత్రము బయలుదేరి వెల్లింగ్డన్, ఆస్పత్రిని చూచినాడు. ఢిల్లీ సంక్షోభములో తుపాకి గాయములతో చికిత్స పొందుతున్న వారినందరినీ చూచినాడు.

### టెలిగ్రాముల బట్వాడా

న్యూఢిల్లీ సెంట్రల్ టెలిగ్రాఫ్ ఆఫీసువారు న్యూఢిల్లీలోనూ పాత ఢిల్లీలోనూ టెలిగ్రాము కార్యస్థానాల కిటికీల దగ్గర టెలిగ్రాములు బట్వాడా చేయడానికి ఏర్పాట్లు చేసినారు. చాలామంది వారివారి నివాస ప్రదేశాలను మార్చివేసినందువల్ల టెలిగ్రాములను బంట్రోతులచేత అందచేయడము కష్టము అయినందువల్ల వారివారి సదుపాయము కోసము ఈ ఏర్పాటు చేయవలసి వచ్చింది. ఇంతే కాకుండా ఇప్పుడు పనిలోకి వస్తూఉన్న టెలిగ్రాము బంట్రోతులవల్ల రెండవమారు టెలిగ్రాములను అందచేయడమున్నూ సాధ్యముకాకుండా ఉంది. ఇది తాత్కాలికపు ఏర్పాటు.

### రావల్‌పిండిలో సంఘటన

రావల్‌పిండి, సెప్టెంబరు 11: నిన్న రావల్‌పిండి కంటోన్మెంటులో యిద్దరిని పొడిచి చంపిరి. ఐనను నగరము శాంతముగానే యున్నదీ.

న్యూఢిల్లీ, సెప్టెంబరు 12: నేటి ఉదయం ప్రధాని పండిత జవహర్లాల్ నెహ్రూ, ఉపప్రధాని సర్దార్ పటేలు, విద్యాశాఖ మంత్రి మౌలానా ఆజాద్ గారలు బిర్లా భవనములో మహాత్ముని దర్శించిరి. మహమ్మద్ యామిన్ ఖాన్ గారు, రాష్ట్రీయ సేవక సంఘమునకు జెందిన గోల్వాల్కర్ గారు నేడు ఉదయము మహాత్ముని దర్శించిరి.

నేడు మహాత్ముడు కొన్ని శరణాగత శిబిరములను దర్శించుచున్నారు. అ. ప్రె.

## సర్కారులలోధాన్యసేకరణ వృద్ధి

చెన్నపురి, సెప్టెంబరు 12: సెప్టెంబరు 4 తో అంతమైన వారం ఉత్తరు సర్కారు జిల్లాలలో ధాన్యం అధికంగా సేకరించబడింది. కాని మొత్తం రాష్ట్రంలో నిలవ తగ్గిపోయింది. రాష్ట్రంలో మొత్తం ఈ వారంలో సేకరించబడిన ధాన్యం 18,355 టన్నులు. గత వారం 18,889 టన్నులు మాత్రమే సేకరించబడింది. నిలవలు గత వారంలో 1,53,378 టన్నులుండగా ఈ వారం 1,47,433 టన్నులకు తగ్గిపోయింది.

తూర్పు గోదావరి జిల్లాలో సెప్టెంబరు 4 తో అంతమైన వారంలో 1110 టన్నులు క్రితం వారంలో 374 టన్నులు, పశ్చిమ గోదావరిలో క్రమంగా 2836 టన్నులు, 1474 టన్నులు, కృష్ణాలో 2594 టన్నులు, 1195 టన్నులు, గుంటూరుజిల్లాలో 463 టన్నులు, 336 టన్నులు, నెల్లూరు జిల్లాలో 1164 టన్నులు, 874 టన్నులు, సేకరించబడింది. దీనితో పోల్చిచూడగా తంజావూరు జిల్లాలో సేకరణ మొత్తం తగ్గిపోయింది. సెప్టెంబరు 4 తో అంతమైన వారంలో 1246 టన్నులు సేకరించబడగా గతవారంలో 1728 టన్నులు సేకరించబడింది.

మధ్యరాష్ట్రమునుండి పంపగలరన్న 5,000 టన్నుల ధాన్యం ఇప్పటికి చెన్నరాష్ట్రం చేరినది. భారత ప్రభుత్వం వాగ్దానం చేసిన 7,500 టన్నుల ధాన్యములు ఇంకా చేరలేదు.

## యూసాఫ్ స్థితి

రంగూన్, సెప్టెంబరు 11: బర్మా పూర్వ ప్రధాని హత్యా నేరంలో ప్రధమ దోషిగా నిర్ణయించబడిన యూసా తన తరపున వాదించడానికి ఒక బ్రిటిషు న్యాయవాదిని నియమించాలని ప్రయత్నిస్తున్నాడు. దీనికి తగిన ద్రవ్యంకోసం తన ఆస్తిని తాకట్టు పెట్టిగాని మరేవిధంగాగాని తనకు సమకూర్చి పెట్టవలసిందని కోరుతూ ఆయన బర్మా ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టాడు.

## "సైనిక దౌర్బల్యం చూపవద్దు"
### పాకిస్థాన్ అధికార్లకు గజ్నఫరాలీ హెచ్చరిక

సార్‌గోదా, సెప్టెంబరు 10: పంజాబులో శాంతి నెలకొల్పు ప్రచార సందర్భమున నేటిమధ్యాహ్నమునకు వచ్చిన పాకిస్థాను ఆహారశాఖ మంత్రి గజనఫరాలీఖాను గారు పశ్చిమపంజాబులో గొప్ప సభయందు ఉపన్యసించుచు పాకిస్థానును న్యాయవిరుద్ధమైన పనులు చేయువారితోను, అల్లరులు చేయువారితోను కూడినదిగా చేయవలదని హెచ్చరించిరి:



న్యాయ పరిపాలకులు క్రమశిక్షణారాహిత్యమును, సైనిక దౌర్బల్యమును ప్రదర్శించినయెడల అధికారములు కోరు హక్కు, రక్షణకోరు హక్కు వారికి లేకుండాపోవునని అట్టివారికి పాకిస్థాను ఆశ్రయమొసంగదని ఆయన ప్రకటించెను. "ప్రభుత్వోద్యోగులను వారి యిష్టప్రకారం తూర్పు పంజాబులోగాని, పశ్చిమ పంజాబులోగాని పనిచేయనిచ్చు నిర్ణయమే యిటీవల పంజాబులో ప్రజ్వరిల్లిన మతకల్లోలములకు కారణము, అధికారులు మార్పిడిపద్ధతి వారి నీతికి భంగం వాటిల్లజేసెను. ఇందువల్ల వారి ప్రవర్తన, ధర్మనిరతి కలుషితమయ్యెను. శాంతిభద్రతలను కాపాడు సంకల్పం వారికుండిన యెడల ఈ ఘోర హింసాకాండను మనము తప్పించుకొని యుండెడివారము. నిర్ణీతమగు కొంతకాలంవరకు ఉభయ పంజాబులలోను రెండు మతములకు జెందిన ఆఫీసరులను నియమించు సూచన నొకదానిని తూర్పు పంజాబు పశ్చిమపంజాబు ప్రభుత్వముల వారు పరిశీలించుచున్నారు" అని గజనఫరాలీఖానుగారనిరి.

ఈ జిల్లాలో మతకలహములు లేనందుకు ఆహారశాఖ మంత్రి సభికులనభినందించెను. హిందువులు, సిక్కులు అధిక సంఖ్యాకులుగా సభకు వచ్చినందుకు సంతోషము వెలిబుచ్చెను.

హిందువుల యొక్కయు, సిక్కుల యొక్కయు ధన ప్రాణములను రక్షింప పాకిస్థాను ప్రభుత్వము అన్ని చర్యలు గైకొనుననీ, లాహోరులో పాకిస్థాను, ఇండియా ప్రభుత్వములు సమష్టిగా కావించిన నిర్ణయములను నిష్కర్షగా అమలు చేయుననీ, ఆయన హామీ యిచ్చెను. (అ. ప్రె.)

## బీహార్ జమీందారీ బిల్లు
### సెలెక్టుకమిటీకి పంపబడినది

రాంచీ, సెప్టెంబరు 11: బీహారులో జమీందారీలను ప్రభుత్వంవారు స్వాధీనం చేసికొను బిల్లును బీహారు రెవిన్యూశాఖామంత్రి శ్రీ కృష్ణవల్లభ సహాయ్ గారు అసెంబ్లీలో ప్రతిపాదించిరి. ప్రతిపాదనానంతరము బిల్లు సెలెక్టు కమిటీకి పంపబడెను. బిల్లును సెలెక్టు కమిటీకి పంపవలసినదిగా రెవెన్యూమంత్రి సభవారిని కోరుచూ, జమీందార్లకు హాని కలిగించు ఉద్దేశ్యముతో తాము జమీందారీలను రద్దు చేయుటలేదని, వ్యవసాయమును వృద్ధిచేయు ఉద్దేశ్యముతో వానిని రద్దుచేయుచుండిరని చెప్పిరి. జమీందారీ పద్ధతి యున్నంతవరకు వ్యవసాయము వృద్ధిగాంచదనిరి. జమీందార్లకు తాము ఇచ్చుచున్న పరిహారము చాలా ఉదారమైనదనిరి.

బిల్లును సెలెక్టు కమిటీకి పంపకుండా సభవారు దానిని వెంటనే విచారించి ఆమోదింపవలెనని పండిత యదునాథ శర్మగారు ప్రతిపాదించిరి. కాని ప్రతిపాదనము అక్రమమైనదిగా త్రోసివేయబడెను. అ. ప్రె.

## హరిజన దేవాలయ ప్రవేశబిల్లు

పూనా, సెప్టెంబరు 11: బొంబాయి రాష్ట్రమునందలి దేవాలయములలో నికి ప్రవేశించుటకును, అర్చనలు చేయుటకును హరిజనులకు హక్కునిచ్చు బిల్లును నేడు బొంబాయి అసెంబ్లీ వారు ఏకగ్రీవముగ ఆమోదించిరి.

## బ్రిటిష్ సేనల నిర్గమనం

బొంబాయి సెప్టెంబరు 11 "సేతియా" అను నావపై నాడాపు 1500 మంది భారతదేశంనుండి ఉపసంహరింపబడుచున్న బ్రిటిషుసైనికులు ఈరోజు వెళ్లిపోయారు. వీరితోపాటువీరికుటుంబాలకుచెందిన 400 మందికూడాకలరు. భారతదేశంనుండి నిర్గమిస్తున్న సైన్యంలో ఇదిమూడవతట్టు.

## జాతీయ విజ్ఞాన పరిషత్తు

చెన్నపురి, సెప్టెంబరు 11: నిన్నసాయంకాలము జాతీయవిజ్ఞాన పరిషత్సమావేశము తిరిగి ప్రారంభమయినది. జాతీయ కవులకు, రచయితలకు, కళాప్రియులకు రాష్ట్రకాంగ్రెసు సంఘమువారు సన్మానపత్రముల సమర్పించిరి. శ్రీ దేవరాజు కృష్ణశర్మగారు ఆహ్వానితులను పుష్పమాలాలంకృతులను చేసిరి. శ్రీ గడియారం వెంకట శేషశాస్త్రిగారు సన్మానసభను ప్రారంభించిరి. శ్రీ పెన్మత్స నారాయణరాజుగారు అధ్యక్షతవహించిరి. శ్రీయుతులు, తల్లావఝుల శివశంకరశాస్త్రి, ఏటుకూరి వసంతయ్య, అడివి బాపిరాజు, మారేమండ రామారావు, వెన్నెలకంటి రామచంద్రరావు, పిలకా గణపతిశాస్త్రి, సత్యనారాయణ చౌదరి, గోవిందరాజుల సుబ్బారావు, హెచ్. వి. రామగోపాల్, దుగ్గిరాల బల రామకృష్ణయ్య, శౌరింఖాన్, నరిమెళ్ల సత్యనారాయణ, దామరాజు పుండరీకాక్షుడు, గిడుగు సీతాపతి, జోసెఫ్, బి. యస్. మూర్తి, కంజిరంటు సుబ్బారెడ్డి, కౌసరాజు రాఘవయ్య, మాడభూషి వెంకటాచారి, శేషబాబు, పర్వతనేని వెంకటేశ్వరరావు, వెంకటచలంచెట్టి, జగన్నాథాచార్యులు, శిల్లా రాజులు రెడ్డి, రామకృష్ణారెడ్డి, భుజంగరాయశర్మ, మాధవాచార్యులుగారలును, మరియు శ్రీమతులు ద్రోణంరాజు లక్ష్మీబాయి, కడవ రామసుబ్బమ్మ, బాలాత్రిపుర సుందరమ్మ, దేవులపల్లి సత్యవతి, సుభద్రమ్మ, అన్నె త్రి రాజ్యంగారలు సన్మానింపబడిరి. సత్యలందరిచే కావ్యగానములు చేయబడెను.

శ్రీ వెంకటశేషశాస్త్రిగారు తమ ప్రధానోపన్యాసములో "విశ్వశ్రేయము కోరే కవి విశ్వప్రజల అభిరుచిని, అభిమతాన్ని, అభ్యుదయాన్ని ఆరాధించవలసి ఉంటుంది. నియమపాలన కష్టమనుమాట సత్యమే. అయితే నియమ మక్కరలేదనడం అందరూ ఒప్పుకోరు. అందరి మాట అట్లుండగా ఆ అన్నవారు కూడా నియమరహితంగా తమజీవితం గడుపలేరు. ఎందుకనగా, ప్రకృతి ధర్మమే నియమబద్ధమైనది. పాలనధర్మం అంతకంటె నియమబద్ధమయినది. ఈ భూమ్యాకాశాల రెంటినడుమ జీవించేలోకం, దాని నారాధించే కవిత్వం ఎట్లా నియమోల్లంఘనం చేయగలదు. అనవసరమూ, అర్థరహితమైన వాటిని మార్చుకోటం అర్థవంతమైన వాటిని కూర్చుకోవటం ఎవరైనా సార్థకంగా వివేచనచేయుటప్పుడే మనమెంతో విజ్ఞత చూపవలసియున్నది" అన్నారు. శ్రీ దేవరాజు కృష్ణశర్మగారు వందనములతో సభ ముగిసినది.

## ఆంధ్రయువజన కాంగ్రెసు

చెన్నపురి, సెప్టెంబర్ 9: ఆంధ్రయువజన కాంగ్రెసు వర్కర్ల సమావేశము నేటి మధ్యాహ్నము వి. పి. హాల్‌లో శ్రీ సూరపనేని శేషగిరిరావుగారి అధ్యక్షతన ఏర్పాటు చేయబడినది. శ్రీ భూపతి కోటేశ్వరరావుగారు, కాంగ్రెసు చీలిపోయి వర్గకూటములుగా ఏర్పడిపోవలెననియు, ధనికుల ప్రాబల్యమునుంచి దేశమును రక్షింపవలెననియు ఉపన్యసించిన తదుపరి సమావేశము వి. పి. హాల్‌లో ముగిసినట్లు తిరిగి రాజకీయమహాసభ పందిట్లో కలుపగలదనియు అధ్యక్షుడు ప్రకటించెను. సమావేశమును పొడిగించమని కొందరు సభ్యులు కోరిరి. తిరిగి శ్రీ యలమంచిలి భాస్కరరావుగారి అధ్యక్షతన సమావేశము ప్రారంభమయ్యెను. శ్రీ పరాశేని వెంకటేశ్వరరావుగారు, కొందరు సోషలిస్టులు, ఫార్వర్డుబ్లాకిస్టులు కాంగ్రెసును విచ్ఛిన్నము చేయ బోవుచున్నారనియూ కాంగ్రెసిట్లు సహింపజాలదనియూ, పదవులలోనున్న కొందరు కాంగ్రెసుకు ద్రోహము తలపెట్టుచున్నారనియు, ఎవ్వరూ అట్టిద్రోహాన్నిసహించరాదనీ చెప్పిరి. కాంగ్రెసును సమర్థించుచూ, శ్రీ శేషగిరిరావుగారి చర్యను ఖండించుచూ తీర్మానింపబడెను. శ్రీయుతులు పెనుగొండ వీరయ్య ఎ. యస్. ఆర్. కృష్ణగారలు మాటాడిరి.

## ఆంధ్ర విద్యార్థి కాంగ్రెస్

చెన్నపురి, సెప్టెంబరు 9: ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ సేవకుల సభ నేడు వి. పి. హాలులో జరిగినది. శ్రీయన్ సత్యనారాయణగారు అధ్యక్షత వహించిరి. అఖిలభారత విద్యార్థి కాంగ్రెసు వారు సర్వభారత విద్యార్థులు ఐక్యము కావలెనని చేసిన తీర్మానమును ఖండించుచూ తీర్మానము చేయబడినది. మదరాసు స్కూళ్లలో తెలుగును తీసి వేయుటను, స్కూలు జీతములను 10 నెలల పాటుకట్టవలెనను ప్రభుత్వనిశ్చయమును ఖండించుచూ, అక్టోబరు 11 మరియు 12 లలో ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ మహాసభను జరిపించుటకు తీర్మానింప బడెను.

## నంబియార్ శిక్షరద్దు

మదరాసు ఎం. ఎల్. ఏ. ఆనందనంబియార్ శిక్షను హైకోర్టువారు 8 మాసములకు తగ్గించుచు తీర్పునిచ్చిరి. ఆశిక్షను కూడ రద్దుచేయుచు ప్రభుత్వమువారు ఉత్తరువు చేసిరి.

## 'పన్నుల విధానం

### గౌ॥ చంద్రమౌళిగారి సూచనలు

మదరాసు, సెప్టెంబరు 11:—"స్వాతంత్ర్యం చేకూరినాక పన్నులవిధానం మారాలి. ఇదివరకు ప్రజల శ్రేయాని కుద్దేశించి పన్నులు నిర్ణయించలేదు. ఇప్పుడు ప్రజా ప్రతినిధులే అధికారానికి వచ్చినారు కనుక పన్నులు విధించే పద్ధతి మారిపోవాలి" అని గౌ॥ క. చంద్రమౌళిగారు, స్థానిక మంత్రిగారు రేడియో ప్రసారం ద్వారా పత్రికాసంపాదకుడు శివరామయ్యగారు ప్రశ్నింపగా తెలిపిరి. ఇదివరకెల్లా పట్టణాల అభివృద్ధికి ప్రభుత్వం పాటు పడింది. ఇకముందు గ్రామసీమల అభివృద్ధికే ఎక్కువ పాటుపడును. జిల్లాబోర్డులు, ఎత్తేసి గ్రామ పంచాయతీలు, ప్రజాసేవాధురంధరులగు వారిచే, ధనికులచే విరాళములచే, ప్రజోపయోగమగు కార్యములు చేయించు విధానముండును. జిల్లా బోర్డు ఎత్తివేసినచో కలిగే నష్టాలను గూడా ప్రభుత్వం వారు శ్రద్ధగ ఆలోచించుచున్నారని మంత్రిగారు తెలిపిరి.

## గోదావరి నది వరదలు

చెన్నపట్నం, సెప్టెంబరు 7: బొబ్బర్లంక గ్రామ రైతుకాంగ్రెసు అధ్యక్షుడు మేడిది వెంకటసుబ్బారావుగారు యీ క్రింద ప్రకటన చేయుచున్నారు.

గోదావరి నది వరదలవలన బొబ్బర్లంక గ్రామము తిరిగి జలమయమైనది. కాపురముంటున్న ఇళ్లు, పశువులపాకలు చాలా భాగము పడిపోయినవి. ప్రభుత్వము వెంటనే తగుచర్య తీసుకొని ప్రజల కష్టములు తొలగించ వలసిందిగా కోరుచున్నాము.

## ఉత్తరవిశాఖజిల్లా పరిస్థితి

గేదెల చంద్రయ్యనాయుడు, వెండి కూర్మన్నగార్లు క్రింది ప్రకటన చేయుచున్నారు.

ఉత్తర విశాఖజిల్లాలోని పేదరు పరిస్థితులు విషమించుచున్నవి. వంశధార, నాగావళి డెల్టాభూములు మినహాగా మిగతాజిల్లా అంతటా వర్షములులేక యోష్యంలేవు. ఏ కొంచెము వర్షానికో నాటిన పైరులు యెండి నీటలు వారుతున్నవి. పాతపట్నం తాలూకాలో కలరావ్యాధిన్నీ గోస్తానీలో మలేరియాయును వ్యాపించుచున్నవి. వెంటనే ప్రభుత్వము తగు శ్రద్ధతీసికొని పైనరు ఇర్రిగేషన్ పనులను విరివిగా సాగనిచ్చి, ప్రతిచిన్న చెరువును మరమ్మతు అయేలాగు చూడవలసినదనియు, కలరా, మలేరియా మొదలగు వ్యాధులను అరికట్టుటకు తగిన కట్టుదిట్టములు చేయవలసినదనియు కోరుచున్నాము.

## దిగువమాఘంలో రాజకీయ సేవకుల సమావేశం

చెన్నపురి, సెప్టెంబరు 11: సెప్టెంబర్ 20 తారీకునాడు దిగువ మాఘంలో జరుగును. శ్రీయుతులు శంకరరావు దేవ్, దుగ్గిరాల బలరామ కృష్ణయ్య, తిమ్మారెడ్డి, కందుల ఓబుల రెడ్డిగారు ఉపన్యసింతురు. ఆదేరోజు సాయంత్రం చిత్తూరులో బహిరంగ సభ కూడా జరుగును. తరువాత సెప్టెంబరు 21 తారీఖునాడు అనంతపూరులో రాయలసీమ కాంగ్రెసు సేవకుల సభ జరుగును. ఆచార్య రంగా గారు అధ్యక్షత వహింతురు. శ్రీ శంకర రావు దేవ్ గారు ఉపన్యసింతురు. శ్రీదేవ్ గారు 22 తారీకున బొంబాయికి వెళ్లెదరు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి శ్రీ ఓబుల రెడ్డిగారు ఈ సమావేశములను జయప్రదము చేయవలెనని ప్రజలకు విజ్ఞప్తి చేయుచున్నారు.

## ఆంధ్రకిసాన్ కాంగ్రెస్

చెన్నపురి, సెప్టెంబరు 10: ఆంధ్రరాష్ట్ర కిసాన్ కాంగ్రెస్ కార్యవర్గం నిన్న టిరోజున విక్టోరియా పబ్లిక్ హాలులో శ్రీ గొగ్గినేని వెంకటసుబ్బయ్యగారి అధ్యక్షత క్రింద జరిగినది.

ధాన్యమును రెండు తరగతులుగా మాత్రమే విభజించి నాణ్యతల భేదమును అర్థరూపాయమాత్రం తగ్గించవలెననియూ ధాన్యంధరలను బస్తా ఒక్కంటికి రు 5 చొ॥ హెచ్చించవలెనని కార్యవర్గం తీర్మానములు చేసినది.

ఆంధ్ర రైతాంగంపై పోలీసుబలమును ప్రయోగించి ధాన్యమును సేకరించుటకు ఉత్తరువులిచ్చిన ప్రధానమంత్రి శ్రీ రామస్వామి రెడ్డిగారి చర్యను ఖండించుచూ మరొక తీర్మాన మొనరించిరి.

ప్రతిసంవత్సరం వరదలువచ్చి పంటలు నాశనమగుచున్న కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలోని బుడమేరు, కొల్లేరు, గుండేరు, ఎర్రకాలువల గట్లను బలపరిచి రిజర్వాయర్లను కట్టించు ఏర్పాట్లు చేయవలసిందని ప్రభుత్వమును కోరినారు.

ఏలూరు మునిసిపలు ఎన్నికల సందర్భమున కమ్యూనిస్టుపార్టీ వారు ప్రచారసభలు చేసుకొనుటకు వీలుండేటట్లు అచట అమలునందున్న 144 సెక్షను నిషేధాజ్ఞ త్వరగ తీసివేయాలని కోరుచు కంభంపాటి సత్యనారాయణగారు, అట్లూరి సర్వేశ్వర రావుగారు [illegible] కార్యదర్శులు మంగళవారం నాడు [illegible]ంచిరి.

# హైదరాబాదు సంస్థాన బడ్జెట్టు

## రూ 5 లక్షల 6 వేలు హెచ్చు నిల్వ

హైదరాబాదు, సెప్టెంబరు 10: నిజాం సంస్థానప్రభుత్వము 1-10-47 నుండి ప్రారంభమైన 1357 ఫసలీ సాలునకు క్రొత్త ఆదాయవ్యయ అంచనా పట్టికను ప్రకటించినది.

ఈ క్రొత్త సంవత్సరములో ఖర్చుపోను ఆదాయములో రూ 5 లక్షల 6 వేలు నిల్వ మిగులు అంచనా వేయబడెను. ఖజానాశాఖా సభ్యులైన నవాబు లియాకతు జంగుగారు నేడు హైదరాబాదు లెజిస్లేటివు అసెంబ్లీసభలో బడ్జెటును ప్రతిపాదించిరి. (ఇండియాప్రభుత్వపు రు 100 లు రు 116 నైజాం సర్కారురూపాయలకు సమానం).

30-9-1948 సంతో అంత్యమగునట్టి రాబోవు సంవత్సరమునకు మదింపు వేయబడిన:—

ఆదాయము: రు. 26,78,10,000.
ఖర్చు: రు. 26 73 04,000.

### గత 1946-47 సం॥ సాలూకు ఆదాయవ్యయ లెక్క

ఆదాయము: రు. 21,26,79,000.
ఖర్చు: రు. 19 34,38,000.
నిల్వ: రు. 1,92,41,000.

1948 సం.నకు రాగల రెవిన్యూ యుద్ధమునకు పూర్వపు సంవత్సరాలలో ఎప్పుడూ లేదు. ఈ 1948 సం.లో హెచ్చు రెవిన్యూలో రు 215 లక్షలవరకు క్రొత్త పన్నులను విధింపుటవల్ల లభించగలదు.

### క్రొత్త పన్నులు

క్రొత్తగా విధింపబడగల పన్నులు ఏమనగా: ఆదాయపు పన్ను: ఇది మొదటిసారిగా యీ సంస్థానములో అమలుపరచబడును. ఇందువల్ల రు 125 లక్షలు లభించును.

వ్యాపారలాభాల పన్నును విధించుటవల్ల రు 20 లక్షలు రాగలవు. విలాసార్థ వస్తువులమీద విధింపబడే పన్నులవల్ల రు 11 లక్షలు లభించును. వడ్డీ వ్యాపారస్థులకు లైసెన్సు రుసుముల క్రింద రు 3 లక్షలు వసూలగును. సిగరెట్లను తయారుచేసే పరిశ్రమలకు పన్ను హెచ్చింపబడును. ఇందువల్ల రు 6 లక్షలు వసూలు కాగలవు. నగదుకు అమ్మకొను ఏకైక పైరు చేయబడు పంటలకు అదనపు పన్నును విధించుటవల్ల రు 50 లక్షలు లభించును

### ప్రభుత్వపు గ్రాంటులు ఖర్చులు

ప్రజాభివృద్ధికరమైన పనులకు యీక్రింది మొత్తములు మంజూరు చేయబడును విద్యాభివృద్ధికి రు 298 లక్షలు, భవనములకు రహదారీ సౌకర్యాభివృద్ధులకు రు 113 లక్షలు వ్యవసాయ జలాధారాభివృద్ధులకు పరిశ్రమల అభివృద్ధికి రు 49 లక్షలు, వైద్య సౌకర్యములు ప్రజారోగ్యమునకు రు 118 లక్షలు మునిసిపాలిటీల అభివృద్ధికి రు 75 లక్షలు గ్రాంటుచేయబడును.

ప్రజలలో విద్యాభివృద్ధికొరకును శాస్త్రపరిశోధనల కొరకును చాలా పెద్ద మొత్తములను నైజామూ ప్రభుత్వము హెచ్చింపదలంచినది.

### ఆహార పరిస్థితి

నైజాము సంస్థానములో ఆహార పరిస్థితి చాలా విషాదకరముగా నున్నది. హైదరాబాదు కో-ఆపరేటివు కమ్మర్షియలు కార్పొరేషనువారు తమ సిబ్బంది ద్వారా ఆహారధాన్యములను సేకరించి సరఫరాలు చేయుచున్నారు. ఈ వ్యాపార సంఘమునకు నిజాముప్రభుత్వము 1946 సం॥ లోను 1947 సం॥ లోను రూ 7 కోట్లు ద్రవ్యసహాయం చేసియుండిరి. ఈ ద్రవ్య సహాయమును హెచ్చించి మరొక రూ 4 కోట్లు యివ్వదలంచి యున్నది. 1948 సం॥లో రూ $7\frac{1}{2}$ కోట్లు యివ్వదలంచి యున్నది.

పన్నుల విధానమునుగూర్చి ముచ్చటిస్తూ ఖజానాసభ్యుడు యిలా అన్నాడు ఈ సంస్థానంలో విధింపదగినంత మేరకు పన్నులు ప్రజలపై విధింపబడినవి. యింతకు మించి పన్నులనువిధించుటకిక అవకాశం లేదు.

పన్నులవిధానము పూర్తిగా మార్పుచెందాలి. పన్నులభారాన్ని ప్రజలందరూ సమానంగా భరించేటట్లుగా పన్నుల నిర్ణయ విధానమును సంస్కరించాలి.

### హైదరాబాదు సంస్థాన బ్యాంకు

హైదరాబాదు స్టేటు బ్యాంకును ఒక రిజర్వుబ్యాంకుగా మార్పుచేయుటకున్ను నోట్లు ముద్రించే అధికారమును ప్రభుత్వ ఋణపత్రములను జారీచేసే అధికారమును దానికి పూర్తిగా ఒప్పజెప్పుటకును ప్రయత్నములు జరుగుచున్నవి. ఇతర బ్యాంకులనన్నింటిని అది కంట్రోలుచేయగలదు.

నైజాము ప్రభుత్వోద్యోగుల జీతములను హెచ్చించుటవల్ల ఖర్చుపద్దు కొంత హెచ్చినది.

### ప్రాజెక్టులు

తుంగభద్ర ప్రాజెక్టుకు రూ 98 లక్షలు ప్రత్యేకింపబడెను. నిజాం సాగర్ జల పాత విద్యుచ్ఛక్తి స్కీముకై రూ 85 లక్షలును, గోదావరిలోయ ప్రాంతాభివృద్ధికి రూ 291 లక్షలును ప్రత్యేకింపబడెను.

సంస్థానంలో బంగారు గనులు దొరకు చోటును పరిశోధించుటకై రూ 10 లక్షలు ప్రత్యేకింపబడెను.

### మద్యనిషేధం

నిషా ద్రవ్యనిషేధమును అమలుపరచుటకై రూ 50 లక్షలు ప్రత్యేకింపబడెను.

ఉస్మానియా విశ్వవిద్యాలయానికి రాబోవు మూడు సంవత్సరాలకు రూ 45 లక్షలు గ్రాంటుచేయబడెను. ఇంకా అవసరమైతే మరికొంత యివ్వబడును. విశ్వవిద్యాలయ పరిపాలనలు తమ ద్రవ్యమును తమ యిష్టానుసారంగా ఖర్చుచేయుటకు [illegible] స్వాతంత్ర్యమును కలిగియుందురు.

# 'రాణిపేట డివిజను ఆంధ్రరాష్ట్రములో చేరాలి'

## ఆర్కాటు తాలూకా ఆంధ్ర మహాసభలో తీర్మానం

ఆర్కాటు, సెప్టెంబరు 8. "ఉత్తర ఆర్కాడు జిల్లాలోని రాణిపేట డివిజన్ పూర్వము తెలుగు ప్రాంతముగా నుండెడిది. కోర్టు రికార్డులన్నీ తెలుగులోనే నడుపబడుచుండెడివి. ఇప్పటికిని బంట్రోతులు ధరించు పురాతన బిళ్లలపై తెలుగే ఉన్నది. ఈ డివిజనులో ఆంధ్రులే అధిక సంఖ్యాకులు. కనక ఆంధ్ర, తమిళ, రాష్ట్రవిభజన సందర్భంలో రాణిపేట డివిజనును ఆంధ్రరాష్ట్రములో చేర్చాలి" అని గతవారంలో ఇక్కడ జరిగిన ఆర్కాటు తాలూకా ఆంధ్రమహాసభలో తీర్మానించారు. సభకు శ్రీ కె. నరసయ్యగారు అధ్యక్షత వహించారు.

ఈ ప్రాంతములో తెలుగు విద్యార్థులకుమాతృభాషను నేర్చుకొనుటకు అవకాశమీయక, తమిళభాషను నేర్పించుచున్న ప్రభుత్వవిధానమును ఖండించారు.

### ఆంధ్ర విశ్వవిద్యాలయ కాన్వొకేషన్

వాల్తేరు, సెప్టెంబరు 9: ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టప్రదాన మహోత్సవము, 13-12-47 శనివారంనాడు వాల్తేరులో జరుగును. పట్టములు తీసుకోవలసిన 27-11-47 లోగా యూనివర్సిటీ రిజిస్ట్రారుకు దరఖాస్తు పంపుకోవలెను.

# వడ్డెవాండ్రకు భూమి మంజూరు

రాయదుర్గం, సెప్టెంబరు 3: స్థానిక కిసాన్‌సంఘ కృషి ఫలితంగా 50 మంది వడ్డెవాండ్రకు 250 ఎకరముల భూమిని కలెక్టరుగారు మంజూరు చేశారు. ఆ ప్రదేశములో రైతు దినోత్సవము నాడు నిప్పాణిగారు జాతీయపతాకనెగురవేశారు. ఉత్సాహంతో వడ్డెవాండ్రు తమకిచ్చినభూమిలో విత్తులు నాటారు. (స్వ. వి.)

# చేనేత కాంగ్రెస్ నాయకుల ప్రకటన

ఆర్లగడ్డ, సెప్టెంబరు 8: చేనేత కాంగ్రెస్ నాయకులు ప్రగడ కోటయ్య, అక్కల కోటయ్యగార్లు గతవారంలో కర్నూలుజిల్లా బండి ఆత్మకూరు, వెలుగోడు, ఆత్మకూరు, నందికొట్కూరు, కర్నూలు, కోడుమూరు, పత్తికొండ, వద్దికెర, బిజనవేముల, కోములకుంట్ల, పదకండ్ల, గ్రామాలలో సంచారం చేశారు. ఆర్లగడ్డలో జరిగిన చేనేతకాంగ్రెస్ సభకు హాజరయారు. సభకు శ్రీ పెట్లా నరసయ్యగారు అధ్యక్షత వహించారు.

# కొఠారి వీరోజీ హత్యకేసు

నరసారావుపేట, సెప్టెంబరు 6: మూడుమాసముల క్రితము స్థానిక మునిసిపల్ మేస్త్రీ కొఠారి వీరోజీని హత్యచేసినారను నేరముమీద కరణం పూర్ణచంద్రరావు, కరణం సుబ్బారావు ఎరంశెట్టి వెంకటేశ్వర్లు అను వారిపై కేసుపెట్టబడెను. గుంటూరుజిల్లా సెషన్సుజడ్జి వారిని విచారించి నిందితులు నిర్దోషులని తీర్పుచెప్పి కేసు కొట్టివేసెను.

### రెవిన్యూమంత్రిగారికి విశాఖజిల్లా రజకుల మెమొరాండం

విశాఖపట్నం, సెప్టెంబరు 8: ఈ జిల్లా రజకులు నిన్న రెవెన్యూ మంత్రిని సందర్శించి, రజకులకు ప్రత్యేకం ఒక కో ఆపరేటివు స్టోర్సు పెట్టుకొనుటకు అనుమతినీయవలసినదని ఒక మెమొరాండం అందజేసిరి. రజకుల కోర్కెను అనుగ్రహించుటకు ప్రయత్నించెదమని మంత్రిగారు వాగ్దానము చేసిరి.

### దేవాలయములో దొంగతనం

భద్రాచలం, సెప్టెంబరు 6: స్థానిక ఈశ్వరాలయంలో మొన్నరాత్రి దొంగలు పడినారు. దేవుని విగ్రహముపై నున్న సుమారు 40 కాసుల బంగారమును దొంగిలించి విగ్రహమును గోదావరినది ఒడ్డున పారవేసినారు. స్థానికపోలీసులు నిన్న దర్యాప్తు చేయగా మద్దినరసయ్య అనువాని యింటిలో చోరీఆస్తి దొరికినది. (స్వ. వి)

# పట్టణవార్తలు

## పేపరు కంట్రోలు

న్యూసుప్రింటుపై అచ్చువేసుకునేపత్రికలవారు కవరుపేజీ ఆర్టుపేపరుమీద ప్రభుత్వంవారి అనుమతి బడయనవసరం లేకుండానే ప్రకటించుకోవచ్చని ప్రభుత్వం వారు ప్రకటించిరి.

బ్లాటింగుపేపరు టిస్యూపేపరు మున్నగునవి కొన్నిరకాలు ఒకరివంచిరకు పెర్మిటు లేకుండానే విక్రయించవచ్చుని కంట్రోలు నిబంధనలు సవరించిరి.

పడిశం పట్టినప్పుడు, నాకు తెలిసిన మంచి వుపాయం ఒకటివున్నది. కొంచెము కిలాకోల్డు పీలిచేయాలి. మామూలు మనిషివి అవుతారు. ఇది లిటిల్సు ఓరియంటల్ వారి ప్రాడక్టు.



# డిస్పోజల్సు

## రీజియనల్ కమిషనర్ (డిస్పోజల్సు) సదరన్ సర్కిల్

యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగ్సు, ఎస్ప్లనేడ్, మద్రాసు.

ఈ దిగువ వేలములు 1947 సం॥రం సెప్టెంబరు రెండవ పక్షములో జరుగును. వేరువిధముగా తెలిపితేనే తప్ప అన్ని వేలములు ఉదయము 10 గంటలకు ప్రారంభింపబడును.

| నెం. | తేదీ | స్థలము | స్టోరులు | వేలముదారుని పేరు. |
|---|---|---|---|---|
| 1. | 16-9-47 | ఇ జనీర్ పార్కు, అల్కడి, ఆవడి. | మిగిలిపోయిన విటుమనైజ్డ్ హెస్సెన్. | మెసర్సు గ్యాలీ అండ్ కో., మదరాసు |
| 2. | 16-9-47 | ఎం. ఇ. ఎస్. డిపో, కన్ననూరు. | మిగిలిపోయిన ఇంజనీరింగు స్టోరులు. | మెసర్సు ఫ్రాంక్ అబ్రహాం, బెంగుళూరు. |
| 3. | 16-9-47 17-9-47 | ఎస్. ఎస్. డి. అల్కడి, ఆవడి. | కాల్వేజి ఫాబ్రికేటెడ్ స్టీల్ అయిటములు, టెంటేజి, క్లోదింగు, బ్లాంకెట్లు, ఏరో స్క్రాప్, ఏరోప్లైర్లు, మిసలేనియస్ సాల్వేజి అయిటములు. | మెసర్సు చారీ అండ్ కో., మదరాసు. |
| 4. | 19-9-47 | ఆర్. ఎ. ఎఫ్. సైట్, రెడ్‌హిల్సు చెరువు. | మిగిలిపోయిన 3 సీప్లేన్, టెండర్లు. | మెసర్సు గ్యాలీ అండ్ కో., మద్రాసు. |
| 5. | 19-9-47 | యు. వి. పార్కు, అగ్రాం, బెంగుళూరు. | మిగిలిపోయిన మోటారు సైకిళ్లు, గేర్‌బాక్సు రియర్ ఆక్సిల్ అసెంబ్లీలు. | మెసర్సు ఫ్రాంక్ అబ్రహాం, బెంగుళూరు. |
| 6. | 19-9-47 (మొ॥ 2 గం.) | బి ఒ. ఎస్. డి. బెంగుళూరు. | మిగిలిపోయిన టెంటేజి. | డిటో |
| 7. | 20-9-47 | ఎస్. టి. డి. సెంట్ థామస్ మౌంటు. | శాల్వేజి, ఇంజన్లు లేని ప్లేనులు, U/S. అంబ్యులెన్సు బాడీ & అంబ్యులెన్సు వెహికిల్. | మెసర్సు గ్యాలీ అండ్ కో., మద్రాసు. |
| 8. | 20-9-47 (ఉ॥ 10 గం.) | స్టేషన్ సప్లయిడిపో, బెంగుళూరు. | మిగిలిపోయిన పెద్ద మొత్తములో గోనె సంచులు. | మెసర్సు ఫ్రాంక్ అబ్రహాం, బెంగుళూరు. |
| 9. | 20-9-47 (మొ॥ 3 గం.) | మైసూర్ లాంప్ వర్క్సు లిమిటెడ్, బెంగుళూరు. | మిగిలిపోయిన ఎలక్ట్రిక్ ఫర్నేసులు. | డిటో |
| 10. | 22-9-47 23-9-47 | 387, ఎం. యు. ఆర్. ఎ. ఎఫ్. ఆవడి. | మిగిలిపోయిన ఎయిర్‌క్రాఫ్టు ఎక్విప్‌మెంటు, కాంపొనెంట్లు, హైడ్రాలిక్కులర్లు వగైరా. శాల్వేజి ఏరోస్క్రాప్, ఎయిర్‌క్రాఫ్టు స్క్రాప్, ఇంజన్ కాంపొనెంట్లు, సాల్వేజి ఎక్విప్‌మెంట్లు; ఫాబ్రికేటెడ్ స్టీల్ అయిటములు పెద్ద మొత్తములో ఎయిరో ఇంజనులు వగైరా. | మెసర్సు జక్రియ అండ్ కో., మదరాసు. |
| 11. | 23-9-47 | డి. ఎ. డి. ఒ. ఎస్. డంపు, మర్రిపాలెం రాణిపేట పోస్టు, విశాఖపట్టణం. | మిగిలిపోయిన అగ్రూమనులు, కాన్వాస్ వెస్ట్ బెల్టులు, పిస్టల్ కేసులు వగైరా. | డిటో |
| 12. | 23-9-47 (మొ॥ 2 గం.) | సింధియా స్టీం నావిగేషన్ కంపెనీ లిమిటెడ్. | మిగిలిపోయిన ఇంజనుతో నడుపబడే ఆర్కు వెల్డింగు సెట్లు. | డిటో |
| 13. | 24-9-47 (ఉ॥ 10 గం.) | ఎం.ఇ.ఎస్. డంప్, విశాఖపట్టణం. | మిగిలిపోయిన ఆయిల్ ట్రాన్స్‌ఫార్మర్లు, కరెంట్ ట్రాన్స్‌ఫార్మర్లు | డిటో |
| 14. | 24-9-47 (మొ॥ 2 గం.) | మిలిటరీ ఫారం, విశాఖపట్టణం. | మిగిలిపోయిన హైడ్రా చేయిర్లు, బ్యారెక్టింగులు, పిప్పెట్లు వగైరా. | డిటో |
| 15. | 24-9-47 | నావల్ స్టోర్సు డిపో, ఆవడి. | మిగిలిపోయిన కంప్రెసరు ఎయిర్ డ్రిల్లింగ అండ్ రివిటింగ్ మెషీనులు, టార్చ్ కటింగు, అండ్ వెల్డింగు పంపు ప్లగ్గు హింజెస్ అండ్ బోల్టులు, బటర్ ప్లయిపాట్లతో వగైరా. | మెసర్సు చారీ అండ్ కో., మద్రాసు. |
| 16. | 27-9-47 (ఉ॥ 10 గం.) | మద్రాసు పోర్టుట్రస్టు. | మిగిలిపోయిన ఫైర్ ఫైటింగు అప్లయన్సులు. | మెసర్సు ముర్రే అండ్ కో., మద్రాసు. |
| 17. | 27-9-47 (ఉ॥ 11 గం.) | సౌత్ క్వే, మద్రాస్ హార్బర్. | మిగిలిపోయిన ఫారం ఫ్యూయల్, ఫ్యూయల్ ఫ్యూమింగ్ ఇన్‌స్టలేషన్ టాంకులతో, మోటార్ డ్రం పంపుసెట్లు. | డిటో |
| 18. | 27-9-47 (మొ॥ 2 గం.) | పి. ఒ. ఎల్. డిపో, తండియార్పేట. | మిగిలిపోయిన బంగ్సు ట్రిస్క్వేర్ $1\frac{1}{2}$" బంగ్సు రిక్ $\frac{3}{4}$" | డిటో |
| 19 | 29-9-47 30-9-47 | వెహికిల్సు డిపో, అల్కడి, ఆవడి. | మిగిలిపోయిన కన్వెన్షనల్ ఫోర్డు అండ్ షెవర్లెట్ ట్రక్కులు, పెద్దమొత్తములో బ్రేక్‌డౌన్ లారీలవంటి స్పెషలిస్టు వెహికిల్సు. అంబ్యులెన్సులు, వాటర్ టాంకర్లు, ట్రయిలర్లు, ఆంఫిబియన్ ట్రక్కులు, పాన్‌టూన్ లారీలు, వగైరా, మోటారు సైకిళ్లు. | డిటో |
| 20. | 29-9-47 30-9-47 | ఎస్. ఎస్. డి, కాల్విక్ | సాల్వేజి U/S ట్రక్కులు రకరకాల తయారీలవి. స్పేర్ రోపులు, ట్రాలీలు, ఫాబ్రికేటెడ్ స్టీల్ అయిటములు, మెషినరీ స్క్రాప్, ఇతర మామూలు సాల్వేజి అయిటములు. | మెసర్సు ఫ్రాంక్ అబ్రహాం, బెంగుళూరు. |

గమనిక:—1. వేలమునాటికి రెండురోజులు ముందుగా సరుకులను స్థలమువద్ద తనిఖీ చేసికొనవచ్చును.
2. పూర్తి వివరములకు పైన సూచింపబడిన వేలముదారులకు వ్రాయుడు.

Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty Street, G. T. Madras.